# కవిసహాయ

తూచిభొట్ల ప్రభాకరశాస్త్రి
ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

# భూమిక

లలితకలలలో అగ్రస్థానము వహించునది కావ్యమొక్కటియే అని కలాకుశలు లెల్లరు ఎప్పుడో అంగీకరించినదియే. కావ్యమున కవి తన ఉత్తమోత్తమ, ఉన్నతోన్నత భావతరంగములలో మునింగి తేలుచు, చిప్పిలు రసమనుభవమున బ్రహ్మానంద మనుభవించుచు, అనుభవింపఁజేయుచు, ఎట్టి మహోన్నతస్థితి నొందునో అది అతనికే ఎఱుక, అందలి రసపుష్టికే ఎఱుక, దాని ననుభవించువారలకే ఎఱుక. కాని అది కేవలము పండితప్రకాండులకే.

ఇఁక జనసామాన్యమును రంజింపఁజేయఁగలది కావ్యములో రెండవమెట్టు దృశ్యకావ్యము. దీనినే పర్యాయముగ నాటకము అందుము. మహోన్నతాశయములతో నిండి, రసభంగము గాక, పాత్రౌచితి తఱుగక, శిల్పమున కొంకుటొంకులు లేక, శ్రోత్రనేత్రానందకరమై, నడకలో కావ్యమువలెనే నాటకము ఇంపు గూర్పఁగలుగు టత్యవసరము. అందులకనియే దానిని దృశ్య"కావ్యము" అనుట. పాత్రధారులను, ప్రేక్షకులను ఆయాదృశ్యములయందలి రసప్రవాహమున ముంచి, ఆయాపాత్రలు తాముగ మార్చివైచి, తన్మయత్వమున నోలలార్చగలదియే ఉత్తమ నాటకము. తక్కినవి వీథినాటకములే.

ఇయ్యదియే ప్రధానాశయముగ భరతమునిప్రభృతులు నాటకలక్షణము ననేకకట్టుదిట్టములతో ప్రకటించియుండిరి. మన సంస్కృతనాటకము లన్నియు ఆత్రోవన నడచి సాటిలేక మేరుశిఖరమధిష్ఠించి అఖండకీర్తిద్యుతి లోకమున నింపుచున్నవి.

వాతావరణము మాఱినకొలఁది అన్ని అంశములలో మార్పులు నిచ్చక్రొత్తలుగ కలుగుచున్నవి. భాషతోఁబాటు వెనుకటిబాట దాఁటి నాటకములును నేఁడు క్రొత్తపోకడలు పోవుచున్నవి. రసమో, విరసమో; పాత్రపోషణమో, శోషణమో; ఏయూరి క్షేత్రోపమో, కవులకు తెలియను; ప్రేక్షకులకు తెలియను. తా మిడుకొనిన ఆశయముమాత్రము మొదలిటినుండి చివరదాకనో, లేక, నడుమనడుమనో, అవకాశము చిక్కినపుడెల్ల తగినపాత్ర కానిండు, కాకపోనిండు, కొందఱచే అనిపించి లోకమునకు కళాయి పెట్టనుంకించుటే వానిముఖ్యాశయముగ అగుపడుచున్నది. ఆపద్ధతికే ప్రస్తుతమున గౌరవముకూడ. కావున నాటకకలాస్వరూపజ్ఞులు ప్రస్తుతమున కష్టించి నాటకములు సృష్టింపఁగడఁగువో నాటకమాది లక్షణమున ముంచివైచి అచ్చొత్తించిన పొత్తము నెందోమూల దాచియుంచుకొనుటల్లగాక దేశకాలపాత్రలగు రెతెఁగిలక్షణము చెడక, కేవలము నూతనముగాక, ఇరు తెఱఁగుల కనుకూలముగ, యుక్తియుక్తముగ నిర్మించుట శ్రేయస్కరమని తోఁచెడిని.

ఆఆశయముతో మేమీ "కవిమాయ" సృష్టించితిమి. సూత్రధారుఁడు, ప్రవేశము, ప్రస్తావన, చూళిక, స్థాపనము, విష్కంభము, మున్నగునవి ప్రత్యేకముగ కైకొనక ప్రదర్శనమున కనుకూలముగ రంగములు గూర్చి ప్రవేశకాదుల వ్యవహారమును రంగములందె ఆయాపాత్రలద్వారా జరిపించితిమి. అది సవిమర్శముగ చదువరు లెఱిఁగికొందురుగాక. నాంది విషయమున—కథాప్రస్తావము పూర్వరంగమున, అంతర్నాటకమున పూర్వరంగమున మర్యాద నతిక్రమింపక సూచింపఁ

బడినది. మా ఈ నాటకమున నాటకలక్షణ మేమాత్రము పొల్లుపోలేదని నిరాఘాటముగ నుడువవచ్చును. తద్‌జ్ఞులకది సువిదితమే కాఁగలదు.

రసమో, రసజ్ఞులే ఎఱుంగుదురు. అద్దానిని వ్రాయఁ బూనిన మనుచరిత్రవిమర్శనముతోఁ బాటు మఱొక ఇంత పొత్త మచ్చొత్తింపవలసివచ్చును. ఆవిషయ మంతర్నాటకమున విమర్శించుకొనునది. సంగీతమువిషయమున—ప్రస్తుతము మనసంగీతమం దభిరుచి మాఱుమూలఁబడి ఇతరప్రాంతముల కూనలమ్మరాగములకు చెవి గోసికొన జనము తయారయియున్నది. సంగీతశాస్త్రములో ఏపద్ధతి అగ్రతాంబూలము నందుకొనునో అది సంగీతజ్ఞుల కెఱుక. కాని ప్రపంచము అనుకరణలలో మునిఁగి తేలుచున్నది. అద్దానిఁబట్టి ఏవో రాగములతో త్రైతక్కలాడించుటకన్న అసలు మానివేయుట యుచితమని మాఆశయము. మన గానమాధుర్యమును చవిజూపుటకొఱకే త్యాగరాజకృతిమాత్ర మిందు పొందుపఱుపఁబడినది.

ఇందలి పద్యములు కొన్ని మా కవితాగురువులు, శ్రీరామకథామృత గ్రంథకర్తలు బ్రహ్మశ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారి కుమారులు, శ్రీరామకథామృతోత్తరకాండరచయితలు, బ్రహ్మశ్రీ రాఘవనారాయణశాస్త్రి గారు మేము కలిసి కూర్చినవి. వీనిలో కొన్ని శ్రీశాస్త్రుల వారి యామావికలో కొలఁదిమార్పులతో గోచరింపఁగలవు.

ఇవిగాక తక్కిన అంశములు గుణగ్రహణ పారీణులకే వదలివైచుచున్నాము.

శాస్త్రి సోదరులు.

## ఇందలిపాత్రలు

### పురుషులు

యోగానందుఁడు (యోగి)
శిష్యుఁడు
పోలీసులు
న్యాయాధికారి
న్యాయవాది
గుమాస్తా
బంట్రౌతు
పాండురంగఁడు

### స్త్రీలు

కవిమాయ (కథానాయిక)
చెలికత్తెలు
అప్సరసలు (నలుగురు)
యామావిక (అప్సరస)
రాధ
రుక్మిణి

# కవిమాయ

## ప్రథమాంకము

### (పూర్వరంగము)

సీ. శ్రీనిషత్సుందరీసీమంతసిందూర
రజ మేజగన్నాథురమ్యమూర్తి;
లతదన్యదైవతయతిజనవ్రాతంబు
జీవనౌషధు లేవిచింత్యుకథలు;
ముక్తమణిక్రేత్రుభక్తవశ్యులకొంగు
బంగార మేమంగళాంగుభజన;
మజగజకృత్త్యంబరాదిసన్నుతివచ
స్సరణిలక్ష్య మెవానిచరణయుగలి;

నెలవు కలుములకలికి కే నలిననయను
పెన్నురము; సాద్రివసధిపూర్వాపెచగణ ము
జాండభాండంబు తెగ సుగముండు నెవని
బొజ్జఁ బాండురంగఁ డతండు ప్రోఁచు మనల.

## మొదటి రంగము

(కావేరీతీరమున చంక నొక సంచి నిడుకొని యోగానందుఁడను యోగి యొకఁడు పాండురంగని ధ్యానించుచు నడచుచుండును.)

యోగానందుఁడు—

మ. చలదూర్మిప్రచయంబగాధమగు సంసారప్రవాహంబునం
గల యావర్తములైన జన్మతతులం గాసిల్లు కీటంబు నీ
విలసత్కారుణికత్వమూఁగొను సద్వృత్తిం దరిం జేరఁ గా
ని లవంబేని స్వతంత్రతం బెరయదున్నిద్రాత్మ, విట్టల్ ప్రభూ!

దేవా! ఈ జగమంతయు నీవైభవమే. భూతభౌతిక జాలములు నీకన్న వేఱైనవి కావని వేదాంతములు నొక్కి వక్కాణించుచున్నవి. ఈశుఁడవైన నీకు సుఖదుఃఖములు, బంధమోక్షములు నెక్కడివి? కేవలమవి బుద్ధి కల్పితములు.

(ప్రక్కగ కవిమాయ యను నొక సుందరాంగి ప్రవేశించును.)

కవిమాయ—(తనలో) ఏమి ఈమహాసీయుని వైరాగ్యము! ప్రపంచమే మఱచినటులున్నాఁడు. లేనిచో దగ్గఱగా నున్న నన్ను చూడకయే ఇట్లు పోవునా? ఈ కొమ్మలు, తీఁగలు, మున్నగువానిలో నన్ను నొక కొమ్మగా భావించి నాఁడు కాఁబోలు ......ఇట్టివానిని నా అందచందములు, చేష్టలు, ఎట్లు వశము చేసుకొనఁగలవు?......అటులని వదలివేయుదునా? మన్మథునిఁ బోలిన ఈ యోగిపుంగ

వుని రూపవైభవము చూడఁజూడ నా ఇంద్రియములు వివశము లవుచున్నవి. మనసునుగూడ దూరదూరముగ లాగివేయుచున్నవి. దేహతాప మ్మంతకంతకు మితిమీఱు చున్నది. ఏమి సేయుదు? ఇఁక నొక క్షణము గడచిన జీవితము నిలుచుటయు సందియమే. ఏమైన నించుక సాహసింపకతప్పదు......రసాభాస మగునేమో...... అది ఇప్పుడే నిశ్చయింపరానిదికదా......వృధాఆలోచనలతో కాలయాపనమేల? ఆతఁడును దూర మరుగు చున్నాఁడు......(తత్తరముతో పరిక్రమించి చుట్టివచ్చి) మునినాధా! కవిమాయ నమస్కరించుచున్నది. (పదములకు నమస్కరించును.)

యోగా—స్వాధీనపతికా భవ (తలపై చేయి నిడి ఆశీర్వదించును.)

కవి—(వినయముతో) మహాత్మా! ప్రాపంచికసుఖములపై నా కాశ లేశమైనను లేదు. మీవచనము లమోఘములు. అవి నన్నిఁక యోగినిఁ జేయునో, భోగినిఁ జేయునో! అదంతయు మీ అనుగ్రహము, ఈదీనురాలి అదృష్టము.

యోగా—దానికేమి? భోగినివి, యోగినివి కూడ కావచ్చును.

కవి—ఈరెండు ఒకతెకే యెట్లు కలుగఁగలవు?

యోగా—స్త్రీ తొల్దొల్త భోగిని కావలయుననిగదా పురాణ ధోరణి?

కవి—భోగానుభవమునకు పరిమితి లేదుగదా. ఆభోగిని ఇంక ఎన్నటికి కెట్లు యోగిని యగును?

యోగా—తగినవరుండు దొరకిన ఆపె కొలందికాలముననే యోగాభ్యాసము చేసి కృతార్థురాలు కావచ్చును.

కవి—అట్టి మగలీ కాలమునం గలరా?

యోగా—లేకేమి?

కవి—ఉన్నను మీబోటివా రరుదు. మాబోటి అబలలకు లభించుట అంతకన్న.

యోగా—అట్లనకుము. అదృష్టమే సర్వముచు సంపాదింపం గలదు.

కవి—పూర్వపుణ్యవశమున లభించిన మీవలననే ఈదీనురాలు అట్టి భాగ్యము నొంద నభిలషించుచున్నది.

యోగా—కృష్ణ, కృష్ణ! (అని చెవులు మూసికొనును.)

కవి—స్వామీ! ఈ అజ్ఞురాలు ఏమేని అపచారము సేయ లేదుగదా!

యోగా—అపరాధమున కేమున్నది?

శా. నీకుం బోలినవానిఁగాఁగ నెవనిన్ నిర్మించె నాధాత సు
శ్రీకున్ వాని వరించి జవ్వనము వాసిం జెంద సౌఖ్యంబు
లన్ గైకోల్సేయుము, నన్నుఁబోలు వికలున్ గామాది
దూరున్ జటానీకశ్మశ్రుభయంకరున్ వలచితేనిన్ నవ్వరే
కామినీ?

కవి—తగినదంపతులు అన్యోన్యానురాగమున సుఖపడుచో లోకులనవ్వులు పువ్వులే.

యోగా—పువ్వులా? అవి సన్న్యాసికిఁ గావు. మధ్యాహ్న సమయమున తిరిపెమునకు పోయినప్పుడో,

ఉ. తాసఁట యోగివర్యుఁడఁట తన్వి నొకర్తుకఁ దెచ్చెనంట, ఈ మానికి భిక్ష సేయవలె, మానిని కేమి యొనర్పఁగావలెఁ? పూని వచింపుఁ డంచుఁ బౌరపౌరుషములాడు జగంబులోన నీకేనియు నాకు నేనిఁ దల యెత్తఁగవచ్చు నెటుల్ తలోదరీ? (అని పరిక్రమించును.)

కవి—(స్వగతము) ఈమహానుభావుఁడు నన్ను మాటలలో ముంచివైచి తప్పించుకొని పోఁ జూచుచున్నాఁడు. తుదకు నేను వరూధినికి నకలు కానుగదా? ...... ...అట్లయిన నీరో, నిప్పో లేకపోలేదు. అంతదనుక పోనేల? ......ఆఁ. ఇట్లు చేసి చూచెద ........(యోగి కెదురుగ నిలిచి, (ప్రకాశముగా) ప్రియదర్శనా!

ఉ. అన్నియు నాత్మకుం దెలిసి యక్కటా! మాటల మోస పుచ్చఁగాఁ జన్నె? నినుఁ విధాతృఁడు నిజంబుగ నాకయి సృష్టిజేసె, నే మన్న నిఁకేమి? లోకమునకై విధివ్రాతఁ దలంగవచ్చునే? పున్నెము గట్టుకొమ్ము ననుబోటిని గాచి మునీంద్రచంద్రమా!

అది యటుండనిండు,

ఉ. తనకుం దానయి కోరి వచ్చిన లతాతన్విఁ విసర్జించె ని ట్టున్న, యౌరా! రస మిట్టు లుండునె? మహామోహాప్తి నా

యంతియర్థ దనకై ప్రాణము వాసెఁ గాల్పనె తపోదాం
దాంత్యాదు? లం చాడు నీ జనవాదంబు సహింతు వెట్లు
దివికై చన్న మునీంద్రో త్తమా?

యోగా—(పరిహాసముగా) ఇఁక ఈజోగి ఎచటికేని మొలత్రాఁ
డెరువు దెచ్చుకొన పోవలయును.

కవి—(చిఱునవ్వుతో) ఇంతియెగదా మీావిచారము!

సీ. గళమున బంగారు గొలు సిచ్చెదనుగాని
మొలత్రాఁ డొనర్పు మో మునివరేణ్య!
పైటచెం గొకకొంత పంచి యిచ్చెదఁగాని
పిడిచుట్టు చుట్టుమో విమలహృదయ!
ఉత్తరీయ మ్మొకఁ డుండె నిచ్చెదఁగాని
బుజమునఁ జేర్పుమో విజితమదన!
లలి కెంపుముక్కుపోగుల నిచ్చెదనుగాని
చెవులకుఁ దవిలింపు మవికలాభ!
చేత జెడలెల్లఁ జిక్కుదీసెదనుగాని
నను నియోగింపు మింక నో యనఘమూర్తి!
చేరి నిరతంబు సేవ సేసెదనుగాని
మదనసామ్రాజ్య మేలుమో మాననీయ!

ఇవి యవి యననేల? ప్రాణములవఱకు నాసర్వస్వము మీా
యధీనమే.

యోగా—(ఇంచుక కోపించి) సుతిని మించ నీయకుము.

కవి—(నమస్కరించి) క్షమింపుఁడు... ...(చేతులు నలుపుచు) నేనా తమకు బోధించుదానను? స్త్రీహింస మహాపాపము. ఈతత్త్వ మెఱిఁగియే మహామునులు పూర్వము తమ తపమునకు విఘ్నమైనను అప్సరసలను శపింపక అనుకూలురైరి. ఇఁక నాతుదిమాట ఒకటి వినుఁడు—

క. శ్రీలలిత! బ్రదుకుదును నీ
యాలింగన మెనసి, దివికి నరిగెదఁ గాదే;
నేలాగు నీట ముంచెదొ
పాలఁ ముంచెదవొ నీదుపాలం బడితిఁ.

(అని కన్నీరు గార్చును.)

యోగా—(కటకటంబడి, వెడనవ్వుతో) పెండ్లి వలదో పెద బాబయ్యా అనువానికి దయ్యపుపెండ్లాము నంటకట్టినట్టు నాబోటి కటికసన్యాసిపైనా నీసాము? ఈరసాభాసపు శృంగారముకోసమై నాతపస్సు గంగలో కలుపుకొమ్మందువా? చాలుఁజాలు. లేనిపోనివెలితిఁ బడకుము.

క. విను మీ వబల వటం చిటు
లనుమానించెదనుగాని యలివేణీ! నా
మునియమముఁ జెఱచు నెవఁ డా
తనిఁ గాల్పనె శాపవహ్నిఁ దద్వంశముతోఁ ?

(అని కొన్ని యడుగులు ముందునకు వైచును.)

[illegible]—(దొంగనవ్వ నవ్వుచు) మునినాథా! నామనవి నవధరింపుఁడు. కామక్రోధములు రెండును తపస్సునకు తగనివి.

వానిలో క్రోధము మిక్కిలి అధమము. కామమో, ఇంచుక వ్రతభంగము కావించినను అంతకన్న వేయి రెట్లు సుఖము కూర్పఁగలదు. 'కామి గాని మోక్షగామి కాఁడు' అను ఆర్యోక్తి మీకు సరిపడనిదా ? సర్వసము లవు మీబోటి మహనీయులకు స్త్రీపురుషవిభేదము కళంకమునుగూడ లేఁగలదు.

యోగా—(తనలో) ఓహో! దీనిమాటలు కోటలు దాటు చున్నవి. ఇట్టివారియెడ మౌనమే మంచు... కాని ఈమె పలుకులలో ఒక నీతియు కలదు.......ఏమైనను సరియే, కామముతోఁబాటు క్రోధమునుగూడ విడువవలయును (వడిగా నడచుచుఁ బోవుచుండును.)

కవి—(స్వగతము) ఈపాటిపన్నాగమున ఈతఁడు నాకు స్వాధీనుఁ డగుట కల్ల. (ఆలోచించి) కానిమ్ము, మఱొక యెత్తు వైచి చూచెద. (యోగి వెంట నడచుచు, ప్రకాశముగా) మునీంద్రా! ఒకమా ఱిటు చూడుఁడు. నేను నిజముగ కామాంధ ననుకొంటిరి కాఁబోలు. వలచినను కామిని ఇట్టి సాహసమునకు దిగునా? నే నొక సాధ్విని. అవివాహితను. తోడిచెలికత్తెలతో వనవిహారము సేయుచు దైవవశమున దారి తప్పి ఒంటిగ జిక్కితిని. సమీపముననే ఉన్న మాయూరికి త్రోవ తెలియక ఇటునటు తిరుగు చుంటిని. భాగ్యవశమున అగుపించిన మీసహాయమున పురి జేర నెంచి మగవారి నమ్మరాక మీహృదయమును దెలిసికొన నట్లంటి. క్షమింతురుగాక. (నమస్కరించును.)

యోగా—(వెనుదిరిగి) ఓహో, అటులనా? పొరబడితిని.

కవి—మహాత్మా! నన్ను నావారలలోఁ జేర్చి పుణ్యము గట్టుకొనుఁడు. అబల నవుట దీనికై ఇంతదనుక ప్రసంగము సాఁగింపవలసివచ్చినది.

యోగా—ఈమాత్రమున కింత కావలెనా? రమ్మా, సుఖముగ నిన్నిలు జేర్చి పోయెద.

కవి—మహాప్రసాదము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

---

## రెండవ రంగము

(నేలఁ గూలఁబడి బాధ నభినయించుచు కవిమాయ, నడచుచు యోగానందుఁడు ప్రవేశింతురు.)

కవిమాయ—అబ్బబ్బ! (కాలు పట్టుకొని) ఎట్టి ఇక్కట్టు సంభవించినది! ఈపాదుముల్లు కూడ ఇప్పుడే దాపురింపవలెనా దైవమా! ఇఁ కెక్కడి యూరు? ఎక్కడి యిల్లు? నట్టడవిలో నడువలేక మరణించుటే విధి విధించెను కాఁబోలు.

యోగానందుఁడు—(ఆతురతతో సమీపించి) అయ్యో అయ్యో! ఎక్క డెక్కడ? ఏది యేది? (కాలు పట్టుకొని వెదకి ముల్లు దీయుట నభినయించుచు.)

కవి—(స్పర్శసుఖ మనుభవించుచు) దేవా! ఇప్పట్టున నన్నుద్ధరించితిరి. కృతజ్ఞురాలను. ఇఁక మెల్లగ బోదము,

నడువు(డు. (లేచి నాలు గడుగులు గెంటుచు వైచి) అయ్యో! పడిపోయెదనేమో! కాలినరము లాగికొని పోవుచున్నది.

యోగా—పాపము, పసిదానవు! పైపెచ్చు పాదుములు! ఏమిచేయుదువు? మెల్లమెల్లగ రమ్మా, ఎండ తీవ్ర మగుచున్నది.

(ఇరువురుఁ గొంతదూరము పోవుదురు.)

కవి—(నడిత్రోవలో చతికిలఁబడి కాలు పట్టుకొని పెద్దగ ఏడ్చును.)

యోగా—(గిర్రున వెనుదిరిగి) మఱల ఇది యేమి?

కవి—చూడక ఈనేలకలుగులో కాలు బెట్టితిని. చుఱుక్కు మనినది. ఇం దేమున్నదో? (పిసికికొనుచు) గజ్జ పగిలి పోవుచున్నది. ఇఁక నా చెలులను చూచు భాగ్యము లేదు. (ఏడ్చును.)

యోగా—(సంచిలోని ఔషధము దీసి పూసి) ఇది సర్వవిష నివారిణి. నీ కే అపాయమును రానీయదు......ఇప్పు డెటు లున్నది?

కవి—మీమందుతో ఉపశమించునటులే ఉన్నది......ఆఁ. ఇపుడు పూర్తిగ బాధ అడఁగినది. కాని, నాకై మీరు పడు శ్రమ కేమి ప్రతిఫల మీయఁగలను?

యోగా—సుఖముగ నీయిలు సేరుటయే నాకు వలయు ప్రతి ఫలము. (ఇరువురు మెల్లమెల్లగ పోవుచుందురు.)

కవి—(నిలఁబడి, పైటతో విసరుకొనుచు) మునీంద్రా! ఇఁక ఒక అడుగైన నిడఁజాల. పదములు పచ్చిపుం డ్లైనవి. అంతకంతకు ఆయాసము మిక్కుట మగుచున్నది. అవయవ ములు వివశము లవుచున్నవి.

ఉ. ఆఁకట నిల్వఁజాలఁ, బురమం చెటు చూచినఁ గానరాదు, నే నోకలుషాపహా! యిచట నుండెద నింకిటఁ బొమ్ము నీవు, నా కాకమలోద్భవుం డెటుల నాననమందు లిఖించె నట్లు యౌఁ, గాకులొ గ్రద్దలో మఱియొకండొ యిఁ కేమి వచింతు నక్కటా! (నేలఁ గూలును.)

యోగా—(జాలిపడి సమీపించి) మెత్తని నీ మేని కీ యిక్కట్లు గూర్చిన బ్రహ్మ నేమనవలయును? ఇంతకు ప్రారబ్ధము! ఈనట్టడవి ని న్నెట్లు విడచి పోఁగలను? "అహింసా పరమో ధర్మః"........నా కొక ఉపాయము తోఁచు చున్నది.

కవి.—ఏమది?

యోగా—నిన్ను నాబుజములపై నిడుకొని గమ్యస్థానమునకుఁ జేర్చిన........

కవి—(చెవులు మూసికొని) హరిహరీ! ఎంతమాట! హాత విధీ! న న్నింతటిపాపమున ముంప నెంచితివిగా!

యోగా—ఇందు పాప మేమున్నది? వివశవగునిన్ను కాఱడ విలో డించి చనిన నాకుమాత్రము పాపము కాదా? సంశయింపకుము.

కవి—సంశయింపకుండు టెట్లు?......ఒకవైపున మిముఁ బోలు పరమపురుషున కపరాధము, మఱొకవైపున పర పురుషునంటిన దోషము. రెండువైపుల ఉచ్చుగల త్రాఁడిది. ఇట్టి అకార్యమున కేనా ఒడిగట్టుట? రామ, రామ!

యోగా—సువ్రతా! దీన నీ కేమియు దోషము రాదు. "ఆపత్సమయే నాస్తి మర్యాదా" అని పెద్దల ఉపదేశము. అందును నే నంగీకరించుటవలన మొదటిదోష మసలే లేదు. ఇఁక రెండవదో—చట్రాతికిని, కొయ్యకును, నాకును వికారము శూన్యము. బంధమోక్షములకు మనస్సుకదా కారణము. అది పరిశుద్ధమైన ఎయ్యదియు దోషము కానేఱదు.

కవి—(తల యూచుచు) సకలము ఎఱింగిన మీరు నే వచించు నంతదాననా? తామె ఉచితగతి నొనర్పుఁడు.

యోగా—ఇప్పటి కిదియే ఉచితము, కాకున్న నాకిట్టి ఆలోచనమే పొడకట్టదు. ఆలసింపక అగుకర్జమున ప్రవర్తింపుము. (గొంతుకకూర్చుండును.)

కవి—(అనుమానము నభినయించుచు సమీపించును. యోగా నందుఁ డామెను బుజములపైఁ గూర్చుండఁబెట్టుకొని మోచికొనుచు చరచర పోవును.)

## మూఁడవ రంగము

(మేడలో కనకాసనముపైఁ గూర్చుండి యోగానందుఁడు, పూజాద్రవ్యములం గొని చెలులతో కవిమాయ ప్రవేశింతురు.)

కవిమాయ—భాగ్యదేవతా! మీ ఒనర్చిన మహోపకారము నకు ఏ నేమి ప్రత్యుపకారము చేయఁగలను? మీపాద పద్మములను పూజించి ధన్యురాల నయ్యెద.

యోగానందుఁడు—ఇంతీ! ఇంత కింత యేల? చింతదక్కి సుఖ ముగ నీయిలు సేరుటయె నాకమూల్యమగు పారితోషికము.

కవి—ఐన మాహృదయముగూడ తృప్తిపడవలయునుగదా. పాదదాసురాలి ప్రార్థన మింత కంగీకరింపుఁడు.

యోగా—నే కాదననేల? అట్లే కానిమ్ము.

కవి—(యోగానందునిపాదములు పూజించి నమస్కరించును.)

యోగా—భిక్షాకాల మతీత మగుచున్నది. ఇఁక నే బోయి వచ్చెద.

కవి—పోయివత్తురుగాక, ఇంత తొందర యేల? నేఁటి కిచ టనె భిక్ష నంగీకరించి ఈ భక్తురాలిగృహము పావన మొనర్పుఁడు.

యోగా—(సంశయించుచు) అ దెట్లు?

చ. పిడికెఁడు భిక్ష పెట్టుమని వీధులవెంబడి పోయి యొవ్వ రే నిడినను దృప్తిఁ జెంది హృదయేశ్వరు విట్ఠలు భక్తిఁ గొల్చి

చొక్కడ నిలువం దలంపక జగమ్మునఁ ద్రిమ్మరుటే వ్రతంబు నేఁ గుడువఁగరాద యొక్కయెడఁ గూరిమి గల్గినయేని సుందరీ!

కావున పోయివత్తు, అప్డు సెప్పకుము. (లేవఁబోవును.)

కవి—(దోసిలొగ్గి) దేవా! అటులైన మీ వ్రతభంగ మొనర్చుట మాకుమాత్రము ముచ్చటా ఏమి? ఈ నా చెలులఇండ్లకు శాస్త్రార్థము పోయి వచ్చి నే నిచ్చు విశేషపదార్థములతో నేఁటి కీచోట భోజనవిధిఁ దీర్పుఁడు. ఆపయి మీ దయ, మా అదృష్టము.

యోగా—(మోమాటముతో) కానిమ్ము, నీమాట ఎందు వలననో నేనును జవదాఁటఁజాలకున్నాఁడ.

(అందఱు యథోచితముగ పరిక్రమించి (నిష్క్రమింతురు.)

## నాల్గవ రంగము

(పులితోలుపైఁ గూర్చుండి యోగానందుఁడు ప్రవేశించును.)

యోగానందుఁడు—అప్పుడే చంద్రుఁ డాకసమున రెండు బారలు సాఁగినాఁడు! ధ్యాననిష్ఠచే ఎంత వేళ తెలియకయే గడచినది! వ్యావహారికదృష్టిలో ఉన్న సామాన్య మానవులకు కాలము లెక్కగాని, పరమార్థనిమగ్నులైన యోగులకు కాలముతో నేమి పని? అయినను, లోకసంగ్రహముసకు నాధర్మము ననుసరించి ఇంకొక జాములోపల నె తులొకయూరికి నా ప్రయాణము సాఁగింపవలసియున్నది.

ఈభక్తురాలికి నా ప్రయాణవిషయము తెలియఁజేసిన బాగుండునని తోఁచెడిని. ఆమె ఇపుడెచట నున్నదో!

కవిమాయ—(ప్రవేశించి) యోగివరా! పాదాభివందనము.

యోగా—కళ్యాణీ భూయాః.

కవి—చాలసారులు మీదర్శనమునకై వచ్చియుంటిని. మీరు ధ్యానయోగములో నున్న కారణమున తిరిగిపోయితిని.

యోగా—అలాగా. నేనును నీకై ఎదురుచూచుచున్నాను.

కవి—అనుగ్రహ మట్టిది. కాని, ఒక మనవి.........

యోగా—అదెద్ది?

కవి—మఱేమియు లేదు—

సీ. పున్నాగపాటలీముఖవృక్షలతికావి
తానమానితము లుద్యానవనము;
లలిగుంజనానుకీరాలాపకలితపి
కారవాఢ్యములు విహారభూము;
లాదర్శమణిచిత్రితాలేఖ్యదర్శనీ
యమ్ములైన మేలిగర్భాలయములు;
పండువెన్నెల నిండఁబర్వి పండువు గూర్చు
సమవిశాలములైన చంద్రశాల
లజిత! తమపాదరాజీవరజము సోఁకి
పావితంబులు కావలదే వలచినఁ
గదలి యన్నపుడెల్ల వచ్చెదరె మీర
లవధరింపుఁడు విన్నప మాదరమున.

ఇది సామాన్యమె. పుండరీకవరదుఁడవు నప్పాండురంగఁడు మా యిలువేల్పు. మాయందలి దయచే దేవదేవుఁడు స్వయముగ మాయింట వెలసియున్నాఁడు. సంవత్సరమునకు రెండుమాఱులు మాత్రమె పూజచేయుటకు మాకవకాశము దయచేసియున్నాఁడు. పూజాకాలమునకు ఆ పరాత్పరుని గదితలుపులు మేము తెఱువకయే తెఱపిడి పడును. ఆమహాభాగ్యము ఈనాఁడు మీఅనుగ్రహముతో పాటు లభించినది. పూజాద్రవ్యములు సమకూర్చి నెచ్చెలులు సంసిద్ధముగ నున్నారు. కావున తాము స్వయముగ రంగని పూజించి మాజన్మసార్థకము గావింపుఁడు.

తే. రంగదేవరతీర్థంబు రాజితముగఁ
దక్షిణావర్తశంఖసంస్థంబు నగుచు
యుష్మదీయకరాబ్జదివ్యోపహార
పావితంబయి తొలఁచుఁ బాపంబులెల్ల.

యోగా—పాండురంగఁడు నీయిలువేల్పా! చెప్పవు! నీ వింత దానవని యూహింపనైతిని. బాగుబాగు.

క. నీవినయము మీశభక్తియుఁ
బావనభావంబు నన్ను బరవశుఁ జేసెన్
నీవినిచినయవి యెల్లన్
భావిని! చూడంగవలయు భావము మెచ్చన్.

మొట్టమొదటిప్రసంగమును జూచి నిను నే నిరసించినది మనసున నుంచుకొనకుము. మన మిరువురము నేకాశ్రయులమేసుమా.

కవి— అయిన దయచేయుఁడు.

(ఇరువురు పరిక్రమించి వింతలు చూచుచు పోవుచుందురు.)

యోగా—పాండురంగని ఆలయ మెక్కడ?

కవి—ఇదిగో, దాపుననే ఉన్నది. చూచితిరా, అదె ఉద్యాన వనము. రంగనిపూజకు తగిన పుష్పము లీలతావృక్షాదికములే అనుదినము సమర్పించుకొనుచుండును. ఇందలి మకరందమును ద్రావి తుమ్మెదలు కమ్మని స్వరముతో రంగనిలీలలు పాడుచుండును. ఆచిలుకలు చెప్పుకొనునది రంగనికథలే. చూచితిరా, ఆకోనేటినడుమ నగపడు దివ్య భవనమే పాండురంగని కేళీగృహము.

యోగా—(చేతులు జోడించి) ఆహా! నేఁ డెంతధన్యుఁడను! పాండురంగని దివ్యదర్శనమున మఱింత పావనుఁడను కాఁగలను.

కవి—(త్రోవఁ జూపుచు) ఇటు దయచేయుఁడు.

(ఇరువురు పరిక్రమించి నిష్క్రమింతురు.)

---

## ఐదవ రంగము

(రంగనిఎదుట నిలిచి యోగానందుఁడు, కవిమాయ, పూజాద్రవ్యములతో చెలికత్తెలు ప్రవేశింతురు.)

యోగానందుఁడు—(చేతులు జోడించి)

సీ. పూతనాజీవితమ్మును బాలతోఁగూడ
మెలసి గ్రోలిన మోవి యిదియ కాదె,
శకటాసురునిరూపు చైతన్యమును జెడ
నెగసి తన్నిన పాద మిదియ కాదె,
వెసఁ దృణావర్తు నూపిరిఁ గంఠముం గిట్టి
పొదివిన భుజయుగం బిదియ కాదె,
గోగోపులభరంబు గోవర్ధనధరంబు
నెత్తిన చిటికెన యిదియ కాదె,

పుండరీకుమదికిఁ బూబోండ్లకన్నుల
కెనక మొనఁగు మూర్తి యిదియ కాదె,
మమ్ముబోంట్లమానసమ్ముల తామస
మ్మెల్లఁ జెఱచు వెలుతు రిదియ కాదె.

దేవదేవా! రాధాకరకిసలయలాలితములగు నీపదారవిందములకివియే వందనములు. లోకైకదీపకా! మాకను దోయికి విందుఁగూర్ప నిట్లు వెలసితివా! బృందారకబృందసమర్చ్యుఁడవగు నిన్నర్చింప నీకింకరుఁ డెంత పున్నెమునర్చెను!

అశరీరవాణి—బిడ్డా! ఆంతరంగికభక్తుఁడవగు నీపూజ లందికొనుటకే ఈనాఁడు నా ఆలయద్వారములు తెఱుతు బడినవి.

యోగా—మహాప్రసాదము. (పూజ నభినయించును. స్త్రీలు పుష్పాదు లందింతురు.)

కవి—(స్వగతము) రంగని అనుగ్రహమున ఈమహానీయు నింతదనుక కొనివచ్చితి. ఫలితాంశము ఎట్లు కానున్నదో? నాప్రయత్నమునమాత్రము లోప మేమాత్రము లేదు. కానిమ్ము, ఇంత చేసిన రంగఁడు అంత చేయక ఊర కుండునా ?

యోగా—(పూజ చాలించి, లేచి నిలువఁబడి, చేతులు జోడించి)

శా. లేవా లోకములందుఁ బూరుషవరా? లేలెమ్ము నిద్రింతు
చున్నావా? ఘోరభవాబ్ధి భీతిఁ గొలిపెన్, శక్యం
బశక్యం బటం చీ వాలోచనసేయరా, దిపుడ రావే
యాపద లావిపవే ప్రావీణ్యం బది యింక నెన్నఁటికి దేవా
పాండురంగప్రభూ !

క. అక్కట! విసివితి లోకము
చిక్కులఁ బడి యనుభవించి చిన్మాత్రుఁడ! మా
యక్కఱఁ దీర్పఁగదే నీ
వక్కట వల్యమ్ము దారి నగపఱచి దయన్.
(కనులు మూసి ధ్యానపరవశుఁ డగును.)

అశరీర—భక్తాగ్రేసరా! నీ కేమి కొఱఁత? మోక్షముమాట చద్దిమాటయే అనుకొనుము. కాని, పూర్వజన్మములోని కామ్యకర్మముల ఫలము నీ వవశ్యము అనుభవింపవలసి యున్నది. దానికి తగిన అల్లక మెల్ల విధాత అల్లియే ఉన్నాఁడు. ఆప్రారబ్ధపుతీఁగ బాగుగ పుష్పించి గుప్పు

గుప్పున పరిమళములు వెదజల్లుచున్నది. ఆతీఁగ ఈతీఁగ బోఁడియే. కావున ఈమెను చేపట్టి కామ్యకర్మఫలముగ ఎల్లసుఖము లనుభవింపుము. ఇది తీఱకున్న నీ కేదియు లభింపనేఱదు.

యోగా—(కనులు తెఱచి ఆశ్చర్యముతో నలువైపులు జూచుచు) ఏమి నాదైవమే ఇట్లు సెలవిచ్చుచున్నాఁడా!

చెలికత్తెలు—(అన్యోన్యము) రంగనిమాటలే ఇవి!

కవి—(స్వగతము) (తల వంచి) పరమేశ్వరా! నీదయారస మీ దీనురాలిపై గుఱియుటకు ఇదియే తరుణము. ఈయోగికి ఒకవేళ జ్ఞానదృష్టి నిచ్చితివో నాకొంప మునిఁగినదే.

యోగా—(అందఱితో) మీ రిపు డేమైన విన్నారా?

చెలికత్తెలు—ఆ. విన్నాము.

యోగా—ఏమని?

చెలిక—మీరఁట, ఏమేమో ప్రారబ్ధమఁట, అందులకే మాచెలి సృజింపఁబడినదఁట. మా కేమేమొ అగమ్యగోచరముగా నున్నది.

యోగా—ఔరా కర్మగతి! తిమ్మని బ్రహ్మను, బ్రహ్మను తిమ్మని జేయు సామర్థ్యము దీనికే కలదు. ఇది ఇటులుండ నే నెంత పొరలిన ఏమి ప్రయోజనము? కానున్నది పూర్తి కావలసినదే.

కవి—(తనలో) అమ్మయ్యా! ఇప్పటికి గట్టెక్కినట్టే.

చెలిక—స్వామీ! ఎవరి వామాటలు? వాని అభిప్రాయమేమి? మీరు సర్వజ్ఞులుగదా!

యోగా—స్పష్టముగ తెలియుచున్న ఈవిషయమున నా సర్వజ్ఞత్వ మెందులకు?

చెలిక—అయిన, మానెచ్చెలి ఇపుడు.....క్రొత్త పెండ్లి కూఁతురు కాఁబోలు. (నవ్వుదురు.)

కవి—(కోపముతో, చేయి విసరుచు) మీ కేమైన దయ్యము పట్టినదా? అసంగతములు కట్టిపెట్టుఁడు.

చెలిక—సంగతములో, అసంగతములో, నీ ఇలువేల్పునకే ఎఱుక; ఈయనప్రారబ్ధమునకే ఎఱుక.

యోగా—(విచారముతో) అవును, అట్లే తోఁచుచున్నది.

మ. నలురాజ్యంబు హరించి, ధర్మతనయున్ సన్యాసిఁ గావించి,
కాననలలో రామనరేంద్రుఁ ద్రోచి తన పంతం బెల్లఁ జెల్లంగ
నన్యులసామాన్యవిశేషముల్ దలఁప కెంతుం బాలు నీ
కిందు జోగులరాయండను నేను జిక్కితినె చిక్కుల్ వెట్టఁ
బ్రారబ్ధమా!

(ఆలోచించి) ఇంతకు నీవేమి చేయుదువు? నాచేసికొన్న కర్మమవేగదా. కానిమ్ము.........ఎట్లయినను నారొట్టె నేతిలోనే పడినది. (కవిమాయను సమీపించి) లోలాక్షీ!

కవి—(ఉలికిపడి) ఏమి ఈవిపరీతము? మీబోంట్ల కిది తగవా? (ప్రక్కకు ఒదుగును.)

యోగా—(సమీపించుచు) మనదేవుని ఆదేశమేగదా యిది?

కవి—(కొంచెము జరుగుచు) ఏదేవుఁడో, ఏదేశమో. నన్ను మాత్రము స్పృశింపకుఁడు.

యోగా—అయిన రంగనియాజ్ఞ నతిక్రమింపవలసిన దే? ఆస్తికులు అలాటిపాపమునఁ బోరు.

కవి—అవివాహితలపై అత్యాచారమునకు ఒడిగట్టుదురా?
(లేచి పోఁబోవును.)

యోగా—లజ్జావతీ! నీ కిదియు ఒక భూషణమే. (చేయి పట్టుకొనఁబోవును.)

కవి—(నాట్యముతో పరిహరించి) మీ యోగ మేమయినది?

యోగా—నాయోగమా; నీయోగమున కెదురుచూచుచున్న ది.

కవి—చాలుఁజాలు, మీశృంగారము శాంత మగుఁగాక.

యోగా—ఇపుడు శృంగారమైనది ఆశాంతమే.

కవి—నన్నారక సిలుగులఁ బెట్టకుఁడు. ఇఁక మీదారి మీరు చూచుకొనుఁడు.

యోగా—దారి రంగఁడే చూపినాఁడు (చేయి పట్టుకొనును.).

కవి—(విదలించుకొనుట నభినయించుచు) తగదు, మీ కిది తగదు. నన్ను వదలివేయుఁడు.

చెలిక—(చూచి, అన్యోన్యముగ) మఱచితిమి, తెఱచిన తలుపులు తెఱచినట్లే ఉన్నవి. సవరించి వత్తము రండు.
(నిష్క్రమింతురు.)

కవి—(చెలులతో) ఇదిగో, నేనును వచ్చుచున్నాను.

యోగా—నేనో?

కవి—ఏమో, నాకు తెలియదు.

యోగా—నాకు తెలియును.

కవి—ఏమని ?

యోగా—ఏమనియా—

శా. పూర్వం దావియు, నీడ మానిసివలెన్ బూబోడి! నీ
వేను నే భావంబం దెడఁబాటు లేక యొకఁడై వర్తించు
సంసారసౌఖ్యావేలాబ్ధితరంగడోలల స్మరవ్యాపార మేపార
దివ్యావేశంబున నూగుచుందము ముహూర్తార్ధంబు
సార్థంబు గాన్.

కవి—(సిగ్గుతో) ఐన నన్ను విడువరా ?

యోగా—

క. విడిచెదను ప్రేయసీమణి!
కడు నెడ మిటు లైన కొలఁది కాయము నసువుల్;
విడువంగలనే నన్నవి
విడువకము న్నేను నిన్ను వెంగలివోలెన్ ?

కవి—(స్వగతము) ఇప్పటికి నామనోరథము సఫల మయి
నట్లు. ఇంక ఏమని సిద్ధాన్నమును కూలఁద్రోసి కొనవలెను.
(ప్రకాశముగా) అపరవిశ్వామిత్రులు, మీ సంకల్పము
కా దనఁ గలవా రెవరు? (సిగ్గు నభినయించును.)

యోగా—దైవానుగ్రహమున సఫలశ్రముఁడ నయితిని.

(ఇరువురు నిష్క్రమింతురు.)

# కవి మాయ

## ద్వితీయాంకము

### మొదటి రంగము

(గడ్డములు మీసములు లేక అతిసుందరాకారుఁడై ఆశ్చర్య పడుచు యోగానందుఁడు ప్రవేశించును.)

యోగానందుఁడు — (గడ్డము తడవికొనుచు) ఔరౌరా, ఎంతలో ఎంతమార్పు వచ్చినది! గడ్డములు, మీసములు పోయి యోగి మహావిలాసి యైనాఁడు. కాలమహిమ!... అంతటివైరాగ్యము నాయెడ వైరాగ్యము నొందినది. ఇపుడు దానికిని, నాకును నూఱామడ దూరము. అనాద రింపఁబడి బడిపంచల దూరిన విషయవాసన ప్రేమాస్పదమై అనుక్షణము సేవింపఁజొచ్చినది. ప్రాణాయామము, ధ్యానము, యోగము ఏగంగలోఁ గలసినవో! కాదు కాదు, అవియు నావలెనే కాంతావిషయచింతాసంతాన మున సార్థకము లగుచున్నవి. ఔరా! విషయానంద ప్రభావము! దీనియెుదుట బ్రహ్మానంద మన నెంత? ఇట్టి సుఖసంపాదనమునకు నిమిత్తమవు ఆసుందరీరత్నమునే వేనోళ్ళ కొనియాడవలెను. అట్లే కొనియాడుచునే

ఉన్నాను. నాప్రాణము, హృదయము, దేహము, పూర్వ పుణ్యములమూట, స్వర్గము, మోక్షము, అవి ఇవి అన నేల, నాసర్వస్వము ఆసతితిలకమే. (కూర్చుండి) ఆమె క్షణము దగ్గఱ లేనిచో నాజీవిత మేమౌనో! నోరు ఊరక యిలా పలుకుచున్నదిగాని హృదయము ఆమెకై తటతట కొట్టుకొనుచున్నది. కలిగి కర్మము, లేక దరిద్రము. ఎందులకీ సంతాప మనుభవింపవలె? పిలిచి చూచెద. ప్రేయసీ ! ప్రేయసీ !

తెరలో—ఇదె వచ్చుచున్నాను.

యోగా—రమ్మా, రమ్మా. వలసినపనులు ఇచటనుండియే సవ రించుకొనవచ్చును. యోగిచిత్తము వియోగ మనుభ వింపలేదు.

క. నీవిమలముఖాంభోజము
తావుల చవిఁజూడ మఱిఁగి తాత్పర్యము నీ
త్రోవల విహరింపఁగ నో
భావిని! నిను బాసి క్షణము బ్రతుకంగలనే?

కవిమాయ —(ప్రవేశించి) ఆలసించినందులకు క్షమాపణము వేఁడుకొనుచున్నాను. ప్రాణప్రియా! ఇంక ఇంతగ తహ తహపడెదరేల? (సమీపించును.)

యోగా—(దగ్గఱ దీసి సరసన కూర్చుండబెట్టుకొనును.)

4

కవి—

శా. పోనేపోయెఁ దపంబు; లేవు జపముల్; పుణ్యమ్ము, పాపమ్ము, నిధ్యానం బేది యెఱుంగు దైవమె; సమాధానంబునన్ నన్ను జిత్తానం జేర్చినయంతమాత్రన సమస్తం బిట్లు మాటెంగదా, నీనాధోరణి ధారణిన్ వెలసెడున్ మేలైనసంగీతమై.

యోగా—దానికొఱకే ఈ వీను లెదురుచూచుచున్నవి. జపతపాదు లెక్కడికేఁగినవి? అన్నియు సక్రమముగ జరుగుచునే ఉన్నవి.

సీ. కనుదోయి కీ వింత కానరాకుండిన
నవయవంబుల కెక్కు నాతపంబు;
రామ రామా యంచు రసన జపించు నీ
నామమ్ము విసువక నారతంబు;
ధ్యానగోచర మయి తనరారు నీరూప
మే నెలవునఁ గన్నఁ దాన యవుచుఁ;
జిరకాల మభ్యసించిన యోగవిభవంబు
యోగించె నీయోగ యోగమందె;
కలదు మార్పు నొకింత నేఁ గాదనంగ
నేల? యింద్రియములు మనం బేకమగుచుఁ
జూపి చెప్పెడు సౌఖ్యమ్ముఁ జూఱఁగొంటి
నిన్ని నా ళ్ళిట్టి యానందమే యెఱుంగ.

అది యటుంచి, నీమృదుమధురగానకలాకౌశలమున నా వీనులవిం దొనర్పుము.

కవి—(నేపథ్యమును చూచి) చెలీ! నావీణె నిటు తీసికొని రమ్ము.

చెలి—(వీణెతో ప్రవేశించి యిచ్చి నిష్క్రమించును.)

కవి—(వీణె మీటుచు)

శుద్ధదేశి—ఆది

పల్లవి

ఎందు కౌగిలింతురా ని - న్నెంతని వర్ణింతురా ని ॥న్నెం॥

అనుపల్లవి

అందమైన కుందరదన - ఇందిరా హృన్మందిరా ని ॥న్నెం॥

చరణము.

నీదు పలుకే పలుకురా - నీదు కులుకే కులుకురా -

నీదు తళుకే తళుకురా - నిజమైన త్యాగరాజనుత ని ॥న్నెం॥

యోగా—(ఆనంద మనుభవించుచు) సెబాస్. చెవులత్రుప్పుడు రాలిపోయినది. కిన్నరులు, గంధర్వులు నఁట. కవుల తెలువులే గాని వారికి నేరుపులుకూడనా? దీని కెద్ది తగిన పారితోషికము? (విచారించి) సఖి! నీగానమునకు కానుకగ నాహృదయము నీఅధీనము గావింతు, కై కొనుము.

కవి—నాథా! ఇవియెల్ల నిన్న మొన్న పాండురంగఁడు సాక్షిగ నాకర్పించితిరే. ఇచ్చినవానినే మఱల ఇచ్చుటలో విశేష మేమున్నది? మత్తేవైన క్రొత్త లున్న దయచేయుఁడు.

యోగా—ఓహో! నే నిపుడు హరిశ్చంద్రుఁడ నైనటు లున్నదే.

కవి—అంతభాగ్యముకూడనా ? హరిశ్చంద్రునకు తన నమ్ముకొనుపాటి అధికారము కలదు. మీకో ?

యోగ—ఐన ఆజన్మాంతము ఋణగ్రస్తుఁడనే ? హరిహరీ !

కవి—జన్మజన్మమునఁగూడ.

యోగా—ఇంకేమిగతి ?

కవి—విశేషజ్ఞులగు మీకు నేఁ జెప్పవలెనా ?

యోగా—(ఆలోచించి) ఆ! తెలిసినది. (ముద్దిడఁబోవును.)

కవి—(నాట్యమున పరిహరించును.)

యోగా—(ఆతురతతో) ప్రేమమూర్తి! ఇది తగవా?

తే. పాలు గారెడు నీదుకపోలఫలక
మందుఁ గనుఁగొననిమ్ము నాయకము నేఁడు
ముద్దు లద్దాలు గిద్దాలు మోటుగావె
ఋణమొ పణమో విచారింత మెప్పుడేని.

కవి—ప్రియతమా! ఉచిత మరయవలదా ? ఇచ్చెదనన్న బహుమానము అట్లే ఉన్నది. అప్పుమీఁద మఱొక అప్పా?

యోగా—ఇవేమంత బాధింపవుగాని,

తే. అప్పటప్పటి కీదాసు యాచితమ్ము
తప్పఁ జూచితి వేని సత్యంబు వింటె
నవల! జీవింపఁగలనె గండాలు గడచి
మోవి పేరిటి యమృతంపు బావిఁ బడక

(అధరము నాసించును.)

కవి—(నాట్యమున పరిహరించి) చాలుఁజాలు. సమయా సమయములు లేవా? ఇంతకు మగవారల కడఁకువ తక్కువ. (అని చుఱచుఱ చూచును.)

యోగా—మఱి వారు ఆడువారి అనుగ్రహము నపేక్షించుట అందువలననే......పొరబాటు. అది వారితప్పు కాదు.

ఆ. తప్పుసేయువారు దాగియ యున్నారు
చిగురుబోండ్ల చిత్తసీమలందు
వారు విసర ముసరు వాలుచూపులతూపు
లెంత లెంత లేని సంతరించు.

కవి—తమతప్పు తప్పుకొన ఇట్టి పన్నాగములు పన్నిన కవులు మీవారేగదా!

యోగా—మావారిపన్నాగములే. వాని ఉపయోగము మాత్రము మీది. కాని ఒక్కమాట......

చలికత్తె—(బాధతో విలపించుచు కాలొకటి చేతఁ బట్టుకొని వచ్చి నేలఁ జతికలఁబడును.)

యోగా—(లేచి సమీపించి, పరిశీలించుచు) ఏమది?

చెలి—ఇదిగో, ఇచటనే. కప్పంత తేలొకటి నాపుచ్చు మాపినది. అయ్యయ్యయ్యో! (బాధ నభినయించును.)

యోగా—ఎవ రక్కడ? ఏదీ, నామందులసంచి?

దాసి—(ప్రవేశించి) అయ్యో! మీమాటలలోనే సంచి తేఁబోఁగా అక్కడిది అక్కడనే మాయమైనది.

యోగా—(ఆశ్చర్యముతో) ఏమిచిత్రము! .......కానిమ్ము.
మంత్రించెదను. (మంత్రము పెట్టును.) ఇపు డె ట్లున్న ది?
చెలి—ఎట్లున్నదా? ఇంతకు పూర్వమే కొంచెం నయం.
యోగా—(విచారముతో) (స్వగతము) మందులసంచితోఁ బాటు మంత్రశక్తిగూడ మనైనదికాఁబోలు!
కవి—(స్వగతము) ఇప్పటికి నాభయము తీఱినది. మందులు మాయమైె మంత్రములు పనిచేయనివాని శాపములు మాత్ర మేమి సేయఁగలవు? (ప్రకాశముగా) చెలీ! అద్దానికి తగిన చికిత్స నేఁ జేయఁగలను. లోనికి రమ్ము. (చేయి పట్టుకొని తీసికొనిపోవును. దాసియు వెంటఁజనును.)
యోగా—ఆహా! ఎట్టిస్థితికి వచ్చితిని! పెద్దపామునోటఁ బడిన వైకుంఠపాళిలోని పంటపావుపరిస్థితి నాయెడ అన్నివిధముల కనుపట్టుచున్నది. ఏమి చేయుదును? గడచినదానికి చింత యేల? దొఱకినజవరాలితో యథేచ్ఛముగ ప్రాపంచికసుఖము లనుభవించుటయే కర్తవ్యము. (ఆలోచించి) నే నొక్కఁడనే ఇక్క డెందులకు? ప్రియురాలి చేరువకే చేరుకొనియెదఁగాక.

(పరిక్రమించి నిష్క్రమించును.)

---

## రెండవ రంగము

(వింధ్యారణ్యమున నొక బాలముని సమాధినిష్ఠుఁడై ప్రవేశించును.)

బాలముని—(సమాధి చాలించి లేచి) ఆహాహా! గురుపాద సేవ ఎంతకుఁ జాలదు! బ్రహ్మానందరసమున నిమగ్నుఁడ నైతిని. మేరుశిఖరము నధిష్ఠించితిని. ఇంక నా కేమి కొదువ? జీవన్ముక్తుఁడను. (ఇంచుక యోజించి) నే నిచట కూరుచుండి పండ్రెండేండ్లు గడచినవి. నాగురువరుఁడు ఎందువలననో నన్ననుగ్రహింప వచ్చెదనన్న గడువునకు రాకున్నాఁడు. ఆమహాత్ముఁడును నావలెనే ఎచటఁ గూర్చున్నాఁడో? యోగులపని ఏమున్నది? బుద్ధిని అటు త్రిప్పినంతవఱకే వారిప్రయత్నముగాని పాటున పడుట ఎన్నటికో? ఎట్లో? పూర్వ మొక యోగి తిరుగఁబోత ఆలస్యములోపల సమాధి నొంది మూఁడుయుగముల కావల తెలివొందిది తిరుగఁబోత ఐనదా అని అడిగెనఁట. (ఆలోచించి) ఆఁ. మా ఆచార్యుఁడు పోవుచు పలికిన పలుకులు ఇపుడు జ్ఞప్తికి వచ్చుచున్నవి. "వత్సా! పండ్రెండేండ్లకు నేను తిరిగి వచ్చి యోగసిద్ధుఁడవగు నిన్ను గలిసికొనెద. ఒకవేళ రాకున్న నీవే నాజాడ తెలిసికొన ప్రయత్నింపవలసియుండును." అని. ఇఁక నే నా నియోగమున ప్రవర్తింపవలయునని తోఁచుచున్నది. కానిమ్ము, ఇపుడే సమాధి వదలిన నేను శరీరపటుత్వమున

కింత భిక్ష సంపాదింపవలయునుగదా. ఈఘోరారణ్యములో ఎవ్వరైన గృహస్థు లుందురా? ఉన్న వారే పిలిచి పెట్టెదరు. నాపని నేను నిర్వర్తించెద. (లేచి జోలె చేతికి దగిలించుకొని పరిక్రమించుచు)

సీ. ఈయకించనున కొకింత భైక్షము వెట్టుఁ
డార్యులార, గృహస్థవర్యులార!
ఈపేదతపసి కొకింత యోరెము వెట్టుఁ
డమ్మలార, మునులకొమ్మలార!
ఈగురుభక్తున కింత భక్తము బెట్టుఁ
డీశలార, వనేందిరేశలార!
ఈక్షుధార్తున కొకయింత సాదము పెట్టుఁ
డగములార, ననదీవగములార!

దేవమానవపన్నగతిర్యగాది
మూర్తులార, యథాకామవర్తులార!
సిద్ధునకుఁ బెట్టుఁ డొక్కింత సిద్ధ మన్న
మన్నలార, యివ్వనిఁ గొన్న మిన్నలార!

వనదేవతలు—మునిదారకా! ఇటు ఇటు. ఇవె ఫలములు, ఇవె కందమూలములు, ఇవె మధురరసాయనములు, ఇవె భక్ష్యములు. (అని తల కొకరుగా పలుకుచు నాల్గువైపుల తాము కనఁబడక చేతులు సాచి భిక్షము పెట్టుదురు.)

ముని—(భిక్షము గొని, (మఱొకవంకకుఁ దిరిగి) ఆ కనఁబడు కొలనిబడ్డున నిది ఆరగించి గురుకార్యధురంధరుఁడనయ్యెద.

ఆయనజాడఁ దెలియ భూనభోంతరాళములు గాలించి వైచెద. (అని పరిక్రమించుచు, వెనుదిరిగి)

తే. అరిగివచ్చెదనమ్మ, పుణ్యాశ్రమమ్మ!
నీదయా ప్తి ఫలించె నానియమమెల్ల
నిన్ను బాయునిమిత్తము నేఁడు పొసఁగె
మఱువకుండుము నిన్నేను మఱువ నెపుడు.

(నిష్క్రమించును.)

---

మూఁడవ రంగము

(సుందరాకారముతో యోగానందుఁడు, కవిమాయ పరివారముతో ఉద్యానవనమున ఒకచో సుఖాసీనులై యుందురు. వారిముందు నాట్యము ప్రారంభమగును. ఒకఁడు యోగానందుని చూచుచు మద్దెల వాయించుచుండును. నాట్యసమయమున మద్దెలమ్రోత విని యోగానందుఁడు కొంచెము బిత్తరపోయి నలువైపులు చూచుచుండును. నాట్యము ముగిసినపిదప—)

కవిమాయ—(నర్తకితో) నీనాట్యనైపుణి మాకెంతయు ఉల్లాసము గూర్చినది. ఇది కైకొనుము. (ఒక రత్నహారము బహూకరించును.)

నర్తకి—మహాప్రసాదము. (హారము నందుకొని సవిలాసముగ నిష్క్రమించును.)

కవి—మార్దంగికశిఖామణీ !

మార్దంగికుఁడు—(సవినయముగ చేతులు జోడించి సమీపించును.)

కవి—నీకలాకౌశలమునకు తగిన బహుమాన మీఁజాలనందులకు ఎంతయు చింతిలుచున్నాను. (అని యొక ఉంగర మీఁబోవును.)

మార్దం—అమ్మా! నా కివి యన్నియు నేల ?

తే. పద్మలోచన! ధనముతో బాంధవమ్ము
నిలువఁబోవదు; పరిచయనియతిఁ గోరి
మీదరిం జేరితిని నను మెచ్చి రేని
నాదరమున మీవానిఁగా నరసికొనుఁడు.

కవి—(అచ్చెరువుతో) ఇ దేటిమాట ? ధనముతో నవసరము లేనివా రుందురా ?

మార్దం—లేకపో లేదు నావంటివారు కొందఱు.

కవి—ఐన నీ వెక్కడి వాఁడవు ?

మార్దం—తల్లీ !

క. వైదేశికుండ రసికస
మాదరమున మెలఁగుదుఁ గ్రమంబుగ విద్యా
ప్రాదుర్భావముకొఱ కే
నా దేశికు వెదకుచుంటి నాయూయెడలన్.

కవి—విద్యార్థులకుమాత్రము ధన మక్కఱలేదా ?

మార్దం—నాకుమాత్రము.

కవి—ఐన మాకుఁ దృప్తి యెట్లు?

మార్దం—అట్లయిన—

ఉ. వచ్చుచుఁ బోవు చుండెదను వారిజలోచన!భృత్యవృత్తితో
నిచ్చకు వచ్చినట్టులు వహించెదఁ గార్యము భారమెల్ల న
న్మెచ్చిన భోజనం బిడుట మేలు ధనంబు లి వేల? వీడుకో
లిచ్చినఁబోయివత్తునిటులిప్పటికిక్ సుఖముండుమీశుతోక్.

కవి—నీపలుకులు లోకవ్యవహారమునకు దూరముగ నున్నవి.
నా కేమియు బోధపడుటలేదు.

మార్దం—బోధపడకుండుట కే మున్నది?

క. నీనాథుమనసు వడయుట
చూ నాపరమార్థమెల్ల సుదతీ! యింకక్

కవి—దాని కేమి, డబ్బు దసకము లేని యనుగ్రహము లెన్నైన
సంపాదింపవచ్చును.

యోగా—దాని కేమి కొంటత, నీఇచ్చ వచ్చినట్లు ఇచ్చుట మేలఁ
గవచ్చును. పారితోషికమును గొనుట కభ్యంతరమేమి?

మార్దం—అభ్యంతరము లేదు. కాని, పారితోషికధనముతో
ఏమిచేయుదునా అనియే నా అనుమానము.

యోగా—నీ వంత మానివా?

మార్దం—

ధీనిధి! నీదయ గలిగిన
మానిని గానో, జగాన మహితుఁడఁ గానో!

యోగా— నాయనుగ్రహమున నీమానిత్వము నడుగనక్కఱ లేదు.

మార్గం— (ఇరువురితో) అగుఁగాక. చాల తడవైనది. ఇప్ప టికి సెలవొసంగుఁడు.

కవి— అట్లే పోయిరమ్ము. మఱల ఎప్పుడు రాక?

మార్గం— మీచిత్తము వచ్చినపుడెల్ల. (నమస్కరించి నిష్క్రమించును.)

(తెర పడును.)

# కవిమాయ

## తృతీయాంకము

### మొదటి రంగము

(సభాభవనము. యోగానందుఁడు, కవిమాయ, తదితర పరివారము, మఱికొందఱు కూర్చుండియుండి ప్రవేశింతురు. పౌరాణికుఁ డొకఁడు రాగయుక్తముగ శంకరవిజయము పురాణము చెప్పుచుండును. వానిముందు వ్యాసపీఠముపై పుస్తకము తెఱువఁబడి యుంచఁబడును.)

పౌరాణికుఁడు—

శ్లో. అగజాననపద్మార్కం గజానన మహర్నిశం
అనేకదం తం భక్తానా మేకదంత ముపాస్మహే.

శ్లో. అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహు రపరో హరిః
అఫాలలోచనః శంభు ర్భగవాన్ బాదరాయణః.

మహద్భ్యో గురుభ్యో నమః (అని ఉపక్రమించి) అద్యోత్తరకథాప్రారంభః. స్వస్త్యస్తు. సమస్తసన్మంగళాని భవంతు. (పుస్తకమును జూచి చదువును.)

శ్లో. మత్స్యేంద్రనామా హి పురా మహాత్మా
గోరక్ష మాసాద్య నిజాంగగుప్త్యై
నృపస్య కస్యాపి తనుం పరాసోః
ప్రవిశ్య తత్పత్తన మాససాద.

మత్స్యేంద్రుఁ డను పేరు గల ఒకానొక సిద్ధుఁడు దేహము కాపాడుమని గోరక్షకుఁడనే తన శిష్యునకు అప్పగించి ఒకానొక మహత్తరకార్యమును సాధింపనెంచినవాఁడై ఒకానొక రాజశరీరమున ప్రవేశించి పరివారముతో మహా వైభవమున పట్టణమున కరిగి సింహాసనాసీనుఁడై నిష్కంటకముగ రాజ్యమేలుచు నంతఃపురకాంతలతో మంతనము లాడుచు—

శ్లో. సంగీతలాస్యాభినయాదికేషు
సంసక్తచేతా లలితేషు తాసామ్
స ఏష విస్మృత్య మునిః సమాధిం
సర్వాత్మనా ప్రాకృతవ ద్బభూవ.

ఆ అంతఃపురకాంతల సంగీతములు, సాహిత్యములు, నాట్యములు, విలాసములు, మొదలైన విషయములయందాసక్తి గలవాఁడై క్రమక్రమముగా ఆముని మునుపటి తన యోగమును, జపమును, తపమును, సమాధిని మఱచినవాఁడై వారే తాను, తానే వారుగా ప్రవర్తించుచు, ప్రపంచము స్త్రీపురుషమయమే అను తలంపుగ సామాన్య మానవులలోకూడ లెక్కకు రాక జ్ఞానహీనుఁడై రాత్రింబవళ్ళు రాణులతోఁ గూడి సంసారసుఖసక్తుం డయ్యెనఁట.

(అోండి నున్న పొడుముకాయ తీసి పీల్చి కొల్లాయితో ముక్కు తుడుచుకొనును.)

సభ్యులు—(గుసగుసలాడుకొందురు)

ఒకఁడు—ఎంత గొప్పవాఁ డెట్లా తయారయ్యాఁడు!

యోగా—(దిక్కులు చూచును.)

కవిమాయ—(మొగము చిట్లించుకొని పరిపరివిధముల ఆలోచన నభినయించును.)

మఱొకఁడు—గొప్పవాఁడు చెడితేనే అనుకునేది. సన్నజీవాల జోలి ఎవరికి పట్టింది?

పౌరాణి—ఔను నాయనా! లాగివేస్తుంది ఎంతవారినైనా ఈ కామపిశాచి.

శ్లో. గోరక్ష ఏషోథ గురోః ప్రవృత్తిం
విజ్ఞాయ రక్షన్ బహుధాస్య దేహమ్
నిశాంతకాంతానటనోపదేష్టా
నితాంత మస్యా భవ దంతరంగః.

అటుతరువాత కొంతకాలమునకు శిష్యుఁడైన గోరక్షుఁడు గురువుగారి కళేబరమును జాగ్రతగా కాపాడుచు ఎన్నాళ్ళకు మత్స్యేంద్రుఁడు తిరిగి రాకపోవుటవలన శంకించి చింతాక్రాంతుండై మెల్లమెల్లగా నాతని స్థితిగతు లెఱింగికొని తానును మాఱువేషమున పట్టణములో ప్రవేశించినవాఁడై అంతఃపురకాంతలకు నాట్యము, సంగీతము, నేర్పుదు నని

జనానాలో ప్రవేశించి రాజుగారికి అంతరంగికమిత్రుఁడుగా మెలఁగుచు—

శ్లో. తత్రైకదా తత్త్వనిబోధనేన
నివృత్తరాగం నిజదేశికం సః
యోగానుపూర్వీ ముపదిశ్య నిన్యే
యథా పురీం ప్రాక్తన మేవ దేహమ్.

సమయము దొఱకినపుడెల్ల తాను వేదాంతపండితుఁడు వోలె మాటమాటకు వైరాగ్యమార్గము బోధించుచు ఒకానొక సమయమున ఒంటరిగాఁ జిక్కిన రాజు మనంబునకు సంసారముపై అసహ్యము పుట్టునట్లుగా—"మహాత్మా! నీవు మత్స్యేంద్రుఁడను సిద్ధుఁడవుగాని రాజువుమాత్రము కాదు. నేను నీశిష్యుఁడను, చాలకాలము నీరాక కెదురు చూచి విసిగి వెదకికొనుచు మెల్లగ నిన్ను గొనిపోవచ్చితి" నని నచ్చజెప్పి విరక్తుఁడైన గురువునకు యోగమార్గము మొదటినుండియు ఉపదేశించి తనసామర్థ్యముగూడ కొంత అతనికై వినియోగించి మునుపటిశరీరమునకుమామూలుగఁ జేర్చినాఁడఁట. కావున — విషయరసప్రవాహమున కన్నుగానక పడకుండ తప్పించుకొనవలయునుగాని పడినతరువాత మఱల గట్టునఁ బడుట దుర్ఘటముసుమా. (కొంచె మాగి) నేఁటికి చాలింతమా?

సభ్యులు—చిత్తము. నేఁటిపురాణము చాల అమోఘముగ నున్నది.

పౌరాణి — (పుస్తకము ముడిచి)

శ్లో. స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభ మస్తు నిత్యం
లోకాః సమస్తాః సుఖినో భవన్తు.

(హారతి వెలిగించును.)

(తెర పడును.)

---

రెండవ రంగము

(యోగానందుఁడు, కవిమాయ ప్రేక్షకులు, తదితరులు, యథాస్థానముల నాసీనులై యుందురు. కొందఱు నటులు వారియెదుట నాటకము నాడ ప్రారంభింతురు.)

(తెరలో ప్రార్థన)

మ. క్రమ మానట్టులు మూలకారణముగాఁ గల్పించి కొంసంత
దోష మదోషమొ్మ యొకం డోకానోకనిదా శాపమ్ము
సౌఖ్యాంత ముగ్రము కాల్గట్టి భుజింపఁజేసి జగముల్
రక్షింతు ప్రత్యక్షరూపమునం గూరిమి గూరి దూరిత
నృపాపా, పాండురంగేశ్వరా!

(తెర ఎత్తఁబడును.)

(ఆకాశగంగాతీరమున కొంద అప్సరసలు పరస్పరము మాటాడుకొనుచు ప్రవేశింతురు.)

ఒకతె—అయిన నిప్పుడు వారి అభిప్రాయ మేమి ?

రెండవది—మనమెడలకు పుస్తెలు కట్టి ఇల్లాండ్రను జేయ వలయుననియఁట.

మూఁడ—ఇకముందు మనపిల్లలకా లేక ఇపుడే మనకు కూడనా?

నాలు—అందఱికిని.

మొద—ఓహో! సాలగ్రామం ససంపుటం.

అందఱు—(పకపక నవ్వుదురు)

మూఁడ—తాళి గట్టినవారు ఆటలు, పాటలు సమ్మతింతురా?

నాలు—నీమతి యింకను మూఁడవశతాబ్దములోనే తిరుగు చున్నటులున్నదే! ఇప్పటివారికి అబలలు కంటఁబడరాదు.

మొద—ఎందుకనో?

రెండ—స్త్రీల బహిరంగవ్యాపారాలు వారి చిత్తవికారము నకు కారణాలు.

మూఁడ—ఇంక మనము వంటఇంటికుందేళ్ళమే?

నాలు—పరోపకారవ్యాపారాలలో పాల్గొనవచ్చును.

మొద—దీనిని మనప్రభువుగారు అంగీకరించినారా?

రెండ—అంగీకరింపక లోకమునకు ఎదురుతిరుగునా?

మూఁడ—ఇఁక ఇది చాలించి ఆరచ్చచెట్టుక్రింద పచ్చీసుపాళీ వేయుదము, రండు.

అందఱు—(పరిక్రమించి, కూర్చుండి పచ్చీసు ప్రారంభింతురు)

మొద—(పందెము వైచి) ఇవిగో, నాపావులన్నియు ఎక్కినవి.

రెండ—(పందెము వైచి) దస్సురెండు, నీకాయ చచ్చినది కూడాను.

మొద—నీకాయకు నూఱేండ్లు ఆయుర్దాయంకాఁబోలు! (పందెము వైచి) పచ్చీసుమూఁడు. నీకాయగతియు అనంతశయనమే అయినది. చూచితివా, నాపావు మఱల ఎక్కినది!

మూఁడ—(తెరలోనికి చూచి) అదిగో మన యామావిక.

నాలు—చేతిలో క్రొత్తగ్రంథం ఒకటి కనఁబడుచున్నదే.

మొద—గిల్టుఅక్షరాలు కూడాను.

రెండ—దానివలెనే పాత్రమును పొంకముగ ఉన్నది.

యామావిక—(సమీపించును.)

మొద—(చేయి చూచి) ఆగ్రంథముపేరేమే?

యామా—గవ్వలాటలగ్రంథం.

రెండ—గవ్వలాటలా? నవ్వులాటలా?

యామా—ఇంక చాల ఆట లున్నాయఁట.

మూఁడ—నీవు చదువలేదా?

యామా—లేదు. ఇప్పుడే కొనితెచ్చుచున్నాను.

రెండ—పుస్తకముపేరెఱుఁగనిదే ఎట్లు కొంటివి?

యామా—పేరెఱుఁగకేమి? మనుచరిత్రము.

మూఁడ—కవిపేరు అట్టపైన లేదా?

యామా—(చూచి) ఆ. ఉన్నది. అల్లసాని పెద్దన.

మూఁడ—పేరు పెద్దగనే ఉన్నది. రచనయు తగిన ట్లుండ వచ్చును.

రెండ—స్థాలీపులాకన్యాయమున అచటచట రెండు పద్యములు చదువుము. సరసమో, విరసమో, తెలియఁగలదు.

నాలు—ఎందుకీ రామాయణములో పిడుకలవేట్లాట? ఆట పూర్తి కానీయరాదా, తీరికగ చదువుకొనవచ్చును?

రెండ—రసికహృదయములు నూతనగ్రంథము లభించిన పరిశీలింపక కాలయాపనమును కోర్చునా? యామావికా! చదువుము.

అందఱు—(ఆట చాలించి గ్రంథశ్రవణమునకుఁ దయారవుదురు.)

యామా—(పుస్తకము వచ్చినచోటఁ దెఱచి చదువును.)

శా. వందే డెందము కందళింప రహిచే నేకాగ్రతఁ నిర్వృతిం
జెందం గుంభగతప్రదీపకళికాశ్రీ దోఁప నందిందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబు గను నా యింపే పరబ్రహ్మమానందో · బ్రహ్మ యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా.

రెండ—ఎవఁడో విషయానందమును మెచ్చుకున్న వాని యొప్పులు బ్రహ్మానందముతో సంబంధింపఁజేసి ఛను

తాత్కారముగఁ బలికిన సందర్భము ఇందులో పొందుపఱుపఁ బడిఉన్నది. కవిమాత్రము ప్రౌఢుఁడే.

మూఁడ— ప్రౌఢుఁడు! ఏమి రచన! ఏమి రసము! ఏమి భావ గాంభీర్యము! అన్నివిధముల ఈతని కవిమండలికి తాత అని పిలువవచ్చును.

నాలు—ఇఁక చాలును లే. ఆటవైపు తిరుగుఁడు.

మొద—ఒకపద్యము బాగు బాగు కాదు. (యామావికతో) మఱొకచో చదువుము, చూతము.

యామా—(మఱికొన్ని పేజీలు తీసి)

శా. ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁ బైయంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింప హా శ్రీహరీ! యంచుం బ్రాహ్మణుఁ డోరమో మిడి తదీయాంసద్వయం బంటి పొ మ్మంచుం ద్రోచెఁ గలంచునే సతులమాయల్ ధీరచిత్తమ్ములన్ ?

ఒక, రెం, మూఁ —(సంభ్రమ, ఆశ్చర్య, ప్రావీణ్యములతో ఒకరిమొగ మొకరు చూచుకొనుచు) వీఁ డెవరో మన ప్రవరున కించుమించుగ సరిపోవుచున్నాఁడే!

నాలు—(కోపముతో యామావికం జూచి) పని, పాట, తోఁచక నీ వీ పొత్తము నెచ్చట తెచ్చితివి? తెచ్చుకొనిన దానవు నీవే చదువుకొని బావుకొనలేకపోయితివా? నీపేరుకు తగినట్లు మాఆట చెఱచి రసభంగమునకు దావు ఇంచితివే.

ఒక, రెం, మూఁ — (యామావికతో) దీనివిదలింపుల కేమి ? మఱొకపద్యము చదివెదవా ?

యామా—(మఱొకపేజీలో)

తే. అనిన నేమియు ననక యవ్వనజగంధి
మేని జవ్వాదిపస గదంబించు నాడలు
కడిగికొని వార్చి ప్రవరుఁడు గార్హపత్య
వహ్ని నిట్లని పొగడె భావమునఁ దలఁచి.

(పకపక నవ్వును.)

ఒక, రెం, మూఁ — (స్తంభభావముతో ఒకరిమొగ మొకరు చూచుకొందురు.)

నాలు—(పట్టరానికోపముతో పల్లుకొఱుకుచు గ్రుడ్లెఱ్ఱఁజేసి యామావికతో) ఓసిచపలా! నీవంటి పనికిమాలినదానికి గూడ నాచారిత్రము పరిహాసాస్పదమైనదిగా? ఈ నీ తెలువులు నామీఁద చూపిని ఏమి లాభము ? తగిన మిండనిపై చూపిన ఒడి నిండఁగలదు.

మ. అనుకూలుండవు కాముకుండు పయిపై నాసించి యర్థించి వి
న్నను వెల్లం గృతకృత్యమై వెలుఁగుసందర్భంబుతో నేలినా
జను నీవే కృతపుణ్యవై మనెదులే చాల్జాలు నాబోటిగాఁ
జనవుల్ లేవని యింతగాఁ దగునె నీచా ! చప్పటుల్
గొట్టుటల్ ?

అయిన దేమో అయినది. నాకథ నీవా సంస్కరించునది?

తే. నాదుకథ కించుమించుగా నీదుకథయు
నున్న బా గగు, విపరీతయుక్తి నింకఁ
బుడమిలోఁ ద్రోఁచి వలవని పురుషు వలచి
పడు మెడలి దేవభూయంబు పాట్లునీవు.
(అని కోపమున రోజును.)

రెండ— వరూధినీ ! అంతట ఆగుము. (యామావికతో)
సోదరీ! మొట్టమొదట ఎట్టివాఁ డైనను ఒకవిధముగ నీకు
సుముఖుఁడై వాఁడు దివ్యసుఖముల నోలలాడించుఁగాత.
శాపములోని విపరీతయోగము నీపేరున కన్వయించి విన
నిం పొనరించుఁగాక.

మొద—అట్లు భూలోకసుఖము లనుభవించి ఆతఁడు మఱల
ముని యైననాఁడు నీవును స్వస్వరూపముతో మాదరిఁ
జేరఁగలవు.

మూఁడ—ఇవి నీకు వరములే అనుకొనుము.

యామా—(దైన్యమున వడఁకుచు, నిట్టూర్పు విడచుచు,
చింతాక్రాంతయై నిలువఁబడును.)

ఒక, రెం, మూఁ—(విషాదముతో) వరూధినీ ! ఎంతపని
చేసితివే ! ఏమంత అపరాధము చేసినదని మన నెచ్చెలిని
దరిలేని సముద్రమున ఇటు త్రోఁచితివి ? ఇది నీకుఁగాఁగ
సరిపోయినది !

వరూ—ఇతరులకు నీతులు చెప్పుటకు అందఱు పండితులే.

మొద—(మఱింత కోపముతో) ఇపు డెంత సమర్థురాలివైతివే!

శా. నీచారిత్రము నంగడిం నిలుచువానిం దత్కవిం వీడి నీ
నీచారంభముపాలు గాక యిటు నిం నిందాస్పదం జేసి స్వీ
యాచారంబును బ్రోచికొన్న ప్రవరాఖ్యాకుం విసర్జించి
యి ట్లీచంద్రానన లోకువైనఁగ దెతస్వీ! పూని తీచందమున్

మూఁడ—(బార చాచుచు)

క. అప్పటి ఆపనికన్నను
ఇప్పటి ఈకృతి మఱింత ఇంపుగ నుండెం
తప్పి చనెఁ బొమ్ము నిన్నే
మప్పా! ఏమని శపింతు మల్పంబునకున్ ?
శపించిన నీవంటివారమే అగుదుముగదా!

రెండ — ఓసీ !

తే. చేయునపు డెవ్వ రేమని చెప్పుకొందు
రో యను విమర్శ ముండిన నొప్పుఁగాని
చేసితిని నేను నీ వేల చెప్పుకొంటి
వనుచు నెందఱినో ర్మొయనగునె జాణ?

మొద—ఔ నే వరూధినీ!

శా. ఆర్జింపం దగునే మహాదురిత మి ట్లబ్జాక్షి? పాల్గొన్నపుచో
మార్జాలంబులు కన్ను మూసికొనునం మాద్రిం గనం వచ్చె
నీదౌర్జన్యంబునకన్యు లార్తిఁబడుటే ధర్మంబొ?యీనాటి నీ
కర్జంబుల్ సభ లాడిపోసికొన నింకం మాన మే మానోకో?
అపుడు కామము, ఇపుడు క్రోధము.

రెండ—(విషపునవ్వుతో)

మ. ఒక రాజేంద్రుఁడు రేఁగుపం డశుచియై యున్నప్డు భక్షించి
గాయకుకచ్చేరికిఁ బోయి రే యనుచు రాగాలాపముం
జేయు వానికి లంచం బిడ నెంచి చొప్పడమి నెంతే నుల్కి
నేఁ దింటిఁ బొమ్మిక నే మందు వటంచు నాడెనఁట ఓ
యేణాక్షీ! అట్టిదితివ్వొ.

చాల చక్కనిపని చేసితివే!

మూఁడ — నెచ్చెలీ !

తే. నింగి గుమ్మడికాయల దొంగ యనెడు
పలుకు వినినంత బుజములపైనఁ జేయి
సాచి వెదుకంగఁ బూనిన చపలుఁ బోలి
తే మనంగల మకట! ని న్నింతదాని?

ఇంతకు ప్రారబ్ధ మెవరికిని తప్పదు. రావలసినపేరు వచ్చి నదిగదా! పున్నెమో, అన్నెమో, అనుభవించితీరవలెను.

వరూ —(తల వంచి కాలివ్రేలితో నేల రాయుచు విచారము నభినయించుచు)

ఒక, రెం, మూఁ—ఎంత విషపు గడియలలో ఇచ్చటికివచ్చితిమో! ఇంక కొంతసే పుండిన ఇంక ఏ ఆకాశము విఱిఁగి నెత్తిన బడునో! ఇప్పటికిపోదము, నడువుడు. యామావికా! రమ్ము. (అని యామావికను చేయిపట్టుకొని కొనిపోదురు)

వరూ—(విషాదముతో) ఇంతకు నా దురదృష్ట మట్టిది ? జన్మకాలవి శేషము నెవరు తప్పింపఁగలరు ? పాపము, యామావికమాత్రము ఏమి చేయును! నెచ్చెలులు చెప్పి

నట్లు ఇది నాచేతులార చేసుకొనినదేగదా. చారిత్రము లోకములో వ్యాపించిన వెనుక కవులనో రెవరు మూయఁ గలరు? ఏకవియో వ్రాసి బజారులో అమ్ముచున్న గ్రంథము కొనివచ్చి తాను ఎఱుఁగక నెచ్చెలులు చదువు మనిరిగదా అని చదివిన, నాకీ తెలివిమాలిన కినుక ఎందులకు రావలయును? వచ్చినను, అంతంత అడఁచి కొనక శాప మేల ఈయవలెను? అనుభవింపక దానికి తప్పదు; ఈరెండవ అప్రతిష్ఠకూడ నాకు తప్పదు. అది యట్లుండ, సఖురాంద్ర కందఱకు కంటకమైతినిగదా. ఏమి చేయుదును? (ఆలోచించి) ప్రత్యేకము వారిఇండ్లకుపోయి గడచినదానికి కినియక నాపై మైత్రి నెఱపవలయునని వేఁడుకొనియెద. వా రేమనినను సహించెద. (అని దిగ్గన నిష్క్రమించును.)

సభ్యులు—(గుసగుసలు)

యోగా—(స్వగతము) ఆయామావిక శాపమున ఈకవి మాయ ఐయుండవచ్చునా?......దైవమాయ అగమ్య గోచరము......కాని, దేవతాచిహ్నములు కొన్ని దీని యందు కన్పట్టుచునేఉన్నవి. ఏదైనఁ గానిమ్ము. ఇప్పు డెందుకు ఆవిచారము?

కవిమాయ—(తనలో) ఇదంతయు చూడఁజూడ నాకు సంబంధించినటులున్నది. ఈనటుల కీకథ యెచట దొఱికినదో? నెమ్మదిగ దీని లోతుపాతులు తెలిసికొనవలయును.

ులు—(కవిమాయతో జనాంతికముగ) సఖి! నీ కెట్లున్న దోగాని, ఈవిషయము మామనస్సులకు మహావిచిత్రముగ నున్నది.

—తరువాత విచారింతము. ఇప్పటికి పోవుదము, లెండు.

(యథోచితముగ అందఱు నిష్క్రమింతురు.)

---

మూఁడవ రంగము

(ఊరివెలుపల నదీతీరమున యోగానందుఁ డొంటరిగ ఒక తాతిపలకపైఁ గూర్చుండియుండును.)

ోగానందుఁడు—ఆహా, ప్రకృతిరామణీయకము!

సీ. తీవతీవలపూవుదావులఁ గొని విట
కానితీరునఁ బవమానుఁ డేగిచె;
గాలి గుత్తకుఁ గొని కదలి తుమ్మెదజంట
లొగిఁ బూవుటూయెల లూగఁగడఁగె;
దేఁటిపాటలసూటిదీటవు శ్రుతి సేసి
కోకిలస్వరములు కొమరుమిగిలెఁ;
గోయిలపిండుల గాయకత్వము మెచ్చి
యుర్వీజములు తల లూపఁజొచ్చెఁ;
బ్రతిఫలించిన తరులసంపత్తిఁ గాంచి
వివశమై యేటిబోఁటి ద్రవీభవించె;
నా పెహృదయంబు లనఁ జను నంబుజంబు
లాప్రకృతిశక్తి కంజలు లారచించె.

(నలువైపులం గలయం జూచి) ఆహా! పెరిగిన ప్రకృతి తరంగములలో సుమశరుండు ఊయెల లూగుచున్నాండు. మనుజులచూపు లను త్రాళ్ళు వాని నెటుచూచిన అటు లూపుచున్నవి. (ఒకచో దృష్టి నిగుడ్చి) ప్రేమకన్న మధురమైనది ప్రపంచములో ఏదియు లేదుగదా! పశుపక్ష్యాదులును ఆ ప్రేమపాశములచే కట్టువడి తమ అమూల్యమగు జీవయాత్రను సార్థక మొనరించుకొనుచున్నవి. ఆ కీరదంపతులు తమ గుంపు విడిచి అదె ఆకు జొంపములమాటున వాటముగ అమరి ప్రేమవాహినిలో ఈదులాడుచున్నవి............నా ప్రేయసి ఇపు డేమి చేయుచున్నదో! నే నా ఎలనాగవిరహమును సహించి ఇచటి కేల రావలయును? అది దూరమైన, ఈ ప్రకృతి వలనంగాని, ప్రపంచమువలనంగాని, ప్రాణమువలనంగాని ప్రయోజనమేమి బొందుదును? అదియు లోకసామాన్యమైన స్త్రీప్రకృతిగా తోంచదు. మూర్తీభవించిన నా పుణ్యదేవతయే. కావుననే —

ఉ. బిచ్చము నెత్తు నన్నొక కుబేరు నొనర్చెను, గోచిపాత లే
కొచ్చెము జెందువానిని సముజ్జ్వలభూషణభూషితాంగునిం
జెచ్చెరం జేసె, దుఃఖమయశీలమునం జెడనున్నవాని సౌ
ఖ్యోచ్చయసారపారగసమున్నతు సల్పె ననల్పకల్పనన్.

అట్టి కాంతాతిలకముఋణము ఎన్నినాళ్ళకును తీర్చుకొననేఱను......ఇది యటు లుండ........తైనాతివలె వీండొకండు. కూర్చుండనీయండు, నిలువనీయండు. సౌముఖము

చూచినపుడెల్ల తలనొప్పి పుట్టునట్టు మెట్టవేదాంతము లేకరువు పెట్టును. అన్నము పెట్టిన చాలును, కొలువు కొలిచెద నని ఇంట దూరి కొంపకే ఎసరు తెచ్చిపెట్టు చున్నాఁడు. అబ్బబ్బ! వీనివాతఁ బడకుండ ఎట్లు తప్పించు కొనఁగలను? వానిపీడకు తొలఁగ నిచ్చటికి వచ్చిన, ఈ స్మరపీడ దానిని మించినది. ఇంతకు వాఁడు నన్ను వెదకు కొనుచు ఇక్కడికి రాఁడుగదా............

తెరలో—ఇప్పు డా రసికశిఖామణి ఎచట నున్నాఁడో......

యోగా—(వినుట నభినయించి) అదుగో, రానే వచ్చు చున్నాఁడు. ఇం కేమి గతి?

శిష్యుఁడు—(మునివేషమునఁ బ్రవేశించి, యోగానందుని జూచి) (స్వగతము) ఇన్నాళ్ళకు గురుఁ డొంటరిగ దొరికి నాఁడు. నేఁ డెట్లైన నాబోధలచే ఆయనమనస్సును సంసారమునుండి త్రిప్పివైచెద. (సమీపించి) గురువరా! నమస్కారము.

యోగా—రమ్ము. కూర్చుండుము.

శిష్య—గురూత్తమా! నే నెవఁడనో తెలిసికొంటిరా?

యోగా—తెలిసికొన కేమి? ఆనాఁడు మద్దెల వాయించుచు వచ్చి ఇంట చేరి ఇన్నినాళ్ళనుండి వేదాంతగురుఁడవై ఇపుడు శిష్యుఁడను అనుచున్న వేషధారివి.

శిష్య—మహాత్మా! వేషధారి నని గ్రహించితిరిగదా. అంత వఱకు చాలును. ఇన్నివేషములు తమ అనుగ్రహము నకేగదా వేయుచున్నది.

యోగా—నాకు, నీకు ఏమి సంబంధము ?

శిష్యు—ఉన్నది. నాకు తెలియును. మీకును తెలిసినదే. కాని, ప్రస్తుతము కామవ్యామోహమునఁ బడి మఱచితిరి.

యోగా—పోనీ, నీకైన జ్ఞాపక మున్నదిగదా. ఇఁక న న్నుద్ధరింపవచ్చును!

శిష్యు—స్వామీ! అందులకే విన్నవించుకొనఁబోవుచుంటిని. మీరు సర్వసిద్ధులు గల ఒక యోగివర్యులు. నేను తమ శిష్యుఁడను. మీ రీ స్త్రీవలలోఁ బడి మహిమ యెల్లఁ గోల్పోయితిరి. పోయినదానికి చింతపడనేల ? ఇప్పటికైనను మీకు మనసు తిరుగకున్నది. ఆనాఁడు తోటలో నాట్యసమయమున మద్దెల వాయించితిని. పురాణములు చెప్పితిని. నాటకములు చూపితిని. ఇంక ఎన్నెన్నో పాట్లు పడితిని. ఇపుడు మీరు ఒంటరిగ చిక్కితిరని ఉన్నవిషయము ప్రత్యక్షముగ మనవి చేసు కొనుటకు ఇట్లు వచ్చితిని. కావున నాయందలి దయతో వేఁకువజామున ప్రయాణముకండు, పండరిపురము జేరఁ బోవుదము. అచ్చట—

తే. భవునియొడలునఁ బొడమిన భవ్యజలము
కాయసంశుద్ధిఁ గూర్ప సంకల్ప ముడిగి
బుద్ధిధారాసదాధారభూతుఁ జేసి
పాండురంగేశుఁ బతితపావను భజింపు.

దాన, మన చిక్కు లన్నియుఁ దీఱును.

యోగా—ఐనదా నీసోది ? నాపూనికి వినుము.

తే. పూపలతవోలె సుఖపెట్టు పుణ్యరాశి
పొలఁతి విడనాడి రాను పో పొమ్ము నీవు;
శిష్యుఁడవె గిష్యుఁడవె, నీవె చెందరాదె
మోక్ష మే కానలోనైన ముక్కుమూసి.

అది అక్కఱలేదు కుయ్యో మొఱ్ఱో అను నా కీ బలవంతపు బ్రాహ్మణార్థ మెందులకు?

శిష్య—ఏమైనఁ గాసిండు. నావిధి ఇది.

మ. పెరబంధంబుల నూడ్చి, దేహము ననుప్రీతిం దిగంద్రోచి,
యక్షరరంసల్ చనఁ జిత్తదీపమును నిశ్చాంచల్యతంగూర్చి
యప్పరముం బూరుషు బుద్ధితో వెదకు మే ల్భాగ్యంబు
బ్రాపించి, యిద్ధర విశ్రాంతి వహింపుమా గురువరా!
ధన్యుండ నే నయ్యెదన్.

(నమస్కరించును.)

యోగా—(చికాకుపడుచు) నీమాటలు తోఁక తెగిన నక్కబోధలుగ నున్నవి. కాని, సర్వశాస్త్రములలో గృహస్థాశ్రమమే ఉత్తమోత్తమమని కొనియాడఁబడియున్నది. ఈ సన్యాసులనడవడులు మే మెఱుఁగనివి కావు. ఆడువారు తోడు లేనప్పుడు నట్టడవిలోఁ గూర్చుండి మేము జితేంద్రియుల మనవచ్చును. అన్నియు నున్న ఇంట నుండి అసిధారావ్రత మాచరించు గృహస్థులముందు వీ రెందులకును గారు.

తే. విధివివాహిత యిల్లాలు వెతలఁ గుందఁ
గనులు తెఱువని కూనల గతులు సెడఁగ

దండము, కమండలము ముక్తి దారవ్రాయు
నొక్కొ- కామంబు లింతకు నోసరిలునె?
అంతియగాక—

క. మందమతిగాక, జుట్టుం
జందెము మోటుమున కడ్డా, శాంతిఁ జెఱుచునే?
పందలకుఁగాక, కర్మము
నందలి వైరమ్ము మేలె, యతి కది లేదే?

శిష్య—మహామహా! ఇదేటివెట్టి? అందఱు ధర్మముకొఱకే గృహస్థాశ్రమమున జొఱఁబడుచుండిరా?

క. మేలైన వంటకంబులు
లీలావతు లింపు భోగలీలలు గలవం
చాలోచించియ కా కెవఁ
డాలిం గొను నాశ్రమంబునందలిదయతోఁ?

అన్యులసంగతి మన కేల? తమరు కోపింపక సెలవిండు, మీ ఈ ఆశ్రమము ధర్మగృహీతమేనా? ఆకాంతను మీ కెవ రొసంగిరి? మీరు ఏమంత్రతంత్రములతో గ్రహించితిరి? గృహస్థధర్మము లన్నియు మీరు నిర్వర్తించుచుంటిరా?

శా. శ్రౌతస్మార్తములైన కర్మముల నాచారంబులన్ దైవత
వ్రాతం బావన సంచరించితె? యఖర్వజ్ఞాన మార్జించితే?
భూతౌఘంబులు తృప్తి జెందెనె భవద్భూరిప్రదానం

బునా? స్త్రీతాత్పర్యము మాని సంతతికినై చెల్లించితే కామమునా ?

ఇదివఱకు చేయని యజ్ఞములు ముం దేమి చేయఁ గలరు ? మునుపే అన్నియు చేసియుంటి నంటిరా, సంతానముగల మీ రిఁక సన్యసింపవచ్చునుగదా ?

ఆ. ఇంత పిచ్చి గలదె, యెందును దనమేను
తనకుఁ గాదు శాశ్వతం బనంగ
నితరతనువుకొఱకు నింతలింతలు పడు
వారె మిమ్ముఁబోలుధీరు లకట!

గురూత్తమా! ఇఁక .........

యోగా—(మాటలోనందుకొని, లేచి, అతికోపముతో) చాలుఁ జాలు నీవెట్టిమొట్టివేదాంతములు. ఇట్టు లెన్ని కాపురములు తీసి వచ్చితివి? ఇం కెన్ని తీయనుంటివి? ఛీ! పాపీ! నీ మొగము చూడరాదు. నేను రాను. నీచేతనైన పని చేసుకోవచ్చును. (విదలించుకొనుచు చెఱచెఱ లేచి పోవును.)

శిష్యు—(నివ్వెరపడి చూచుచు) అన్ని ఉపాయములు అయి అడుగంటినవి. మిగిలినది, వారికి, నాకు దండోపాయమే. కానిమ్ము. వా రేమి చేసెదరో చూచుచు తరువాతి కార్యక్రమమునకుఁ గడంగెద.

(పరిక్రమించి నిష్క్రమించును.)

# కవిమాయ

## చతుర్థాంకము

### మొదటి రంగము

(మేడలో గోడలపైని దుమ్ము గుడ్డతో దులుపుచు యువక సేవకుఁడొకఁడు ప్రవేశించును.)

సేవ—(దులుపుట నాపి నిలువఁబడి, విచారముతో) అక్కటా! అణిమాదిసిద్ధు లెల్ల కరతలామలకము కావించుకొనిన మహాయోగి, నాగురువరునకా ఈ అధోగతి? ఒకమాయ లాడివలలోఁ బడి విషయానంద మనుభవించుచున్నను, మతికూడ మన్ను కావలెనా? స్వయంవిచారముమాట అటుండనిండు, వెంటనంటి బోధించినను నిజానిజము లాలోచించుపాటి తెలివియైన లేక అడుగంటినదే.........ఎంత ఘోరము.........కామాతురలైన స్త్రీలు ఎంతెంతలు చేయరు, చేయింపరు?......గురువనితయే · అవుఁగాక, ఈచపల చేయించునది యేమి? గురునికొఱకునే నేపనులు చేయను ?......ఈనాఁటివిధానము నాకు మహోపకారమే. దీనితో గురుఁడు నాకు లభించె ననుట నిస్సంశయము.........ఇంతకు సర్వకారణుఁడు పాండురంగని అవ్యాజకరుణాకటాక్షముగదా సర్వార్థదాయకము.

సీ. కారుణ్యరసము పింపారఁ గారుచునున్న
చూపులకోపులు సొగసు లీనఁ,
గైదోయిఁ జేర్చిన కౌనున మేలైన
పట్టుశాలువపడికట్టు మెఱయఁ,
బూలదండల నొప్పు ముందలచొళ్లెమ్ము
పై బర్హిబర్హమ్ము ప్రభలు గులుకఁ,
జిఱునవ్వులయుమోవి చెలువునఁ దొడిగిన
రతనాలకవచంబు రాణ మివులఁ,
దనకుఁ గూరుచువారలఁ గనికరించు
పూన్కి కొక్కింత విశ్రాంతి బొరయకుండ
నిండుకొలువున నిలిచిన పుండరీకు
పాలిభాగ్యమ! కూర్మి న న్నేలుమయ్య!
పతితజనోద్ధారకా!

ఉ. పుట్టితి నమ్మ యయ్య యను పోడిమి లేకయె భాగ్య
యోగ్యతం బట్టితి సద్గురూత్తముని పాదసరోజము, లాఁచి
కొంటి నే పుట్టును నట్టు వాపు పరిపూర్ణభవత్కరుణార్ణ
వంబులో నెట్టనఁ గొన్నిబిందువులు నిర్మలమానస,
విట్ఠలప్రభూ!

(మఱల దుమ్ము దులుపుట కుపక్రమించును.)

(ఇరువురు పోలీసులు వడివడిగ నడచుచు ప్రవేశింతురు.)

పోలీ—యోగానందునినౌకరువు నీవేనా?

సేవ—అవును, నేనే.

పోలీ—యోగానందునికుమారుని జంపిననేరమున నేరస్థునిగ నిన్ను బంధించితిమి. రమ్ము, స్టేషనునకుఁ బోదము.

సేవ—అలాగే.

పోలీ—(చేయి పట్టుకొని కొనిపోదురు.)

(తెర పడును)

---

## రెండవ రంగము

(న్యాయశాలలో న్యాయవాదులు, న్యాయాధికారి, మున్నగువారు యథాస్థానముల నాసీనులై యుందురు. ఒక వైపున బోనులో ముద్దాయి, మఱొకబోనులో ఖిన్నుఁడై యోగానందుఁడు నిలువఁబడియుందురు. వాఁకిట బంట్రౌతు నిలువఁబడియుండును.)

న్యాయాధికారి—అన్నివిధముల ముద్దాయియే హంతకుఁడుగ తేలుచున్నాఁడు. (ముద్దాయితో) నీ కెవరైన ఉత్తర సాక్షు లున్నారా?

ముద్దాయి—లేరు, వేఱే సాక్షులతో అవసరమూ లేదు. నాగురుపత్ని ఒక్కతెయే చాలును.

న్యాయాధి—ఆమె పేరు?

ముద్దా—కవిమాయ.

న్యాయాధి—నీగురువు?

ముద్దా—ఫిర్యాది యోగానందుఁడు.

న్యాయాధి—నీవు ఫిర్యాదికి శిష్యుఁడవా? (కొంచె మాలోచించి) (బంట్రౌతుతో) కవిమాయను పిలువుము.

బంట్రౌతు—(గుమ్మమున) కవిమాయ, కవిమాయ. (అని కేక వైచును.)

కవిమాయ—(విచారముతో ప్రవేశించును.)

గుమాస్తా—ఈ బో నెక్కండి. (యోగానందుఁడున్న బోను చూపును.)

కవి—(అట్లే బోనులో ఎక్కి నిలఁబడును.)

గుమా—నేను చెప్పినట్టు అనండి. దేవునియెదుట...... ప్రమాణంచేసి...... అంతా నిజం...... చెపుతాను..... అబద్ధము చెప్పను.

కవి—(అట్లే అనును.)

న్యాయవాది—(లేచి నిలఁబడి) అమ్మాయీ! మీయింటిలో హత్య ఏసమయమున ఎట్లు జరిగినది?

కవి—(విచారముతో) సూర్యోదయమువేళ నే నింటిలో పనులు చూచుకొనుచున్నసమయమున ముద్దాయి తొట్టిలో నిదురించుచున్న పిల్లవానిఁ దీసికొనిపోయి మాతోటలోని కోనేటిమెట్లమీఁద గుడ్డ లుదికినట్లుదికి చంపివైచినాఁడు.

న్యాయ—అతఁడే తీసికొనిపోయి చంపె ననుట కాధారము?

కవి—అతఁడు తెచ్చిన తడిగుడ్డలమూట నేను విప్పి చూడఁగా తల పప్పుపప్పయి ఉన్న నాకుమారునిశవము కంటఁబడినది.

న్యాయ—అప్పు డేమి చేసితివి ?

కవి—పెద్దపెట్టున ఏడ్చుచు దగ్గఱనే ఉన్న ముద్దాయిని ఇదేమని అడిగితిని.

న్యాయ—వాఁ డే మనెను?

కవి—ఇదియా? 'నీకర్మము. అనుభవింపుము' అని వెక్కిరించుచు నవ్వుచు చివ్వున ఇంటిలోనికి పోయెను.

న్యాయాధి—ముద్దాయి హంతకుఁ డనుటలో సందేహ మే మాత్రము లేదు. (ముద్దాయితో) ఇందులకు నీ వేమందువు?

ముద్దా—అనుట కేమున్నది? చంపినవాఁడను నేను; చంపించినది ఆమె.

న్యాయాధి—ఆమె చంపించుటలోఁగల అవసరము?

ముద్దా—కావలసినంత యున్నది.

న్యాయాధి—అదంతయు నీవు తెలిసియే చంపితివా?

ముద్దా—అవును. గుడ్డలలో పిల్లవాని నదిమి యిచ్చి యజమానురాలు కావున ఊదికి తెమ్మని నా కాజ్ఞాపించినది. సేవకుఁడను నే నట్లే చేసితిని.

న్యాయాధి—(ఆలోచన నభినయించును.)

న్యాయ—ఫిర్యాది నీకు గురు వె ట్లయినాఁడు?

ముద్దా—దానికి చాల గాథ యున్నది. సెలవైన అట్లే తెలిపెద.

న్యాయాధి—ముఖ్యముగ మా కదియే అవసరము. చెప్పుము.

ముద్దా — మాది సౌమ్యనగరమనియు, బ్రాహ్మణులము, మా తండ్రిపేరు ఆనందశర్మ, నాపేరు మలభూనాథుఁడు అని మీ కిదివఱకే చెప్పియుంటినిగదా. మాతండ్రి ఆనందశర్మ చాల ఆత్మవేత్త. దేవతుల్యుఁడు. అనృతమనిన ఆయనకు గిట్టదు. పెద్దల సేవించును. తనచిత్తమున సంసారపుచింత లేదు. లక్ష్మి ఎప్పుడును వాని వీడదు. యోగులు వెదుక వలసినతత్త్వము ఆయనకంటియెదుట నున్నది. అన్నివిధ ముల ఆమహనీయుఁడు ధన్యుఁడే. కాని, అనుగుణ కాకున్నను పూర్వపుణ్యమున ఒక కాంత వాని కిల్లా లయ్యె. ఆయమకు ఐశ్వర్యముననఁగాని, సుఖముననఁగాని ఏలోపము లేదుగాని, సంతానము లేదను చింతమాత్రము తీర్పరాని దయ్యెను. ఒకనాఁడు ఏకాంతమున భర్తతో ఆమె — ఎన్ని యున్న నేమి? ఎన్నినాళ్ళు గడచినను పెద్దల ఋణము తీర్చునోము నోమకపోతిని. చూచుచుండఁగనే నిన్నటి మొన్నటి పిల్ల లెల్లఱు పిల్లలతల్లులైరి. నాకు మాత్రము కలుగరా అని మురియుచుండఁగనే ఇంతకాలము గడచిపోయినది. నేనుమాత్ర మూరకుంటినా? శ్రీశైల మున కరిగితి; పాండురంగని సేవించితి; గ్రామదేవతలకు జాతరలు చేయించితి; పీర్లకు మ్రొక్కితి; సిగ్గుబిడియ ములు లేక దాసర్లకు పాశము పెట్టించితి. ఎన్ని చేసిన నేమి; ఆభాగ్యము మనకు లేదయ్యె. ఈసంపదలు, ఇండ్లు వాఁకిళులు, హారములు, విహారములు, సంతానము లేని మనకేల? — అని వాపోయెను.

న్యాయ—అందుల కాతఁ డేమనెను ?

ముద్దా—సుదతీ! తుచ్ఛమగు ఈసంసారమున కొడుకులు, కూతుండ్రు, బందుగులు, అని దేవులాడువారలకు నామార్గము లభింపఁగలదా? ఘోరసంసారమున మునుఁగు వానిని వానిజ్ఞానము తప్ప మఱెవరు నుద్ధరింపనేఱరు. నీవు నిది తెలిసికొనిన నీదుఃఖము లన్నియు అడఁగును— అని వేదాంతము లుపదేశించెను.

న్యాయ—ఈఉపదేశ మామె కెక్కినదా ?

ముద్దా—ఎక్కిన ఈకథ ఇంత పొడ వెట్లు సాఁగును ? అంత నాతండ్రి—పెండ్లి యైనఁగాని పిచ్చి కుదరదు; పిచ్చి కుదిరినఁగాని పెండ్లిగాదు. నీ కొక యుపాయము చెప్పెదను. శేషాక సిద్ధుఁడు ఈగ్రామమునకు వచ్చును. వానిని సేవింపుము. వాని అనుగ్రహమున కొడుకు కలుగఁగలఁ—డని సెల విచ్చెను. అట్లే ఆవిడ ఎదురు చూచుచుండ మఱునాఁ డుదయముననే ఆయోగి పిడికెఁడు గింజలు ముష్టి పెట్టుఁడని కేకలు వేయుచు వచ్చెను. ఆమె వానికి రత్నములపళ్ళెరము కానుకగ తీసికొనిపోయి విలాసములు చూపఁదొడఁగెను. దాని కాసిద్ధుఁడు మండిపడి ఛీ! దుష్టురాలా! నీకానుకలు నీనెత్తిన వైచికొనుము. మే మిట్టివానికి లోఁబడువారము కాము. ని న్నెంతైన శిక్షింపవచ్చునుగాని నీమగఁడు మాననీయుఁడుగాన బ్రదికితివి, పొమ్ము—అని తిట్టి ముష్టిమాత్రము గ్రహించి సొరకాయబుఱ్ఱలోని భస్మ మొసఁగి—ఇది నీటఁ గలిపి

త్రావుము. చక్కని పుత్త్రుఁ డుదయించును. నేను పండ్రెండేండ్లకు భూప్రదక్షిణము చేసి వచ్చెదను. అపుడు నీకొడుకుం జూపుము. ఈరహస్య మెవరికిని జెప్పకు—మని పోయెను.

న్యాయాధి —ఇదంతయు నాటకమువలె నున్నదే!

న్యాయ—చిత్రకథ. ఆతరువాత?

ముద్దా—ఇరుగుపొరుగున అమ్మలక్కలు జేరి మొగమోటము పెట్టిఅడిగిన తప్పించుకొనలేక ఆమె సర్వము వారలతో చెప్పివైచెను. వారు తల కొకమాటమాటాడి—బూది దిన్న బిడ్డలు పుట్టుదురా? ఇట్టివారివద్ద దయ్యము లుండును. బిడ్డలు లేకపోఁగా ఏదయ్యమో ఆసించిన వదలించుకొనలేక నానాకూడు కుడువవలయును. వయసులో ఉన్న దంపతులుగదా. ఇఁకముందు పుట్టరాదా పిల్లలు ? ఈ బూడిద తినుట మా కంత ఇష్టముగ నుండలేదు. నీవే ఆలోచించుకొను—మని లేచిపోయిరి. అపు డామెయు చపలస్వభావమున ఆభస్మము పాడుదొడ్డిలో పాఱవైచినది.

న్యాయ—నీ వచట పుట్టితివా?

ముద్దా—అవును. ఆయుదంతమే వినుఁడు. పండ్రెండేండ్లకు మఱలి వచ్చి ఆయోగి నీబిడ్డనిఁ జూపుమని అడుగ ఆమె—బిడ్డలులేరు, పాపలులేరు. పోవయ్యా—అని విదలించెను.

అందఱు—(ఆశ్చర్యము నభినయింతురు.)

ముద్దా—ఆయోగియు తనవరదానము వ్యర్థ మయ్యెనని

కోపించి—నిజము చెప్పుము. నీ వా భస్మమును నిజముగ తింటివా?—అని గద్దించెను. దాని కాము నిరుత్తరయై దొడ్డివైపు చూచెను. ఇంతలో ఆనందశర్మ వచ్చి వానిని శాంతింపఁజేసెను. యోగి శాంతించియు 'బూదె యెక్కడ వైచితి'వనుచు అచ్చోటికేగి 'మలభూనాథా! ఇటురమ్ము' అని పిలువ పండ్రెండేండ్లవాఁడనై వటువేషమున నే నుదయించివచ్చితి. అట్టి నన్ను వెంబడి గొనిపోయి వింధ్యారణ్యమున ప్రవేశించి యోగములు, ధర్మములు, తత్త్వములు, సమస్తము ఉపదేశించి— నీ విచటనే తపము సేయుచుండుము. నేను భూప్రదక్షిణము సేసి మఱల పండ్రెండేండ్లకు వచ్చి సిద్ధుఁడవగు నిన్ను గనుఁగొనియెద. రానియెడల నీవే నన్ను వెదకుచు రమ్ము—అని సెలవిచ్చి చనెను.

న్యాయ—నీకు యోగసిద్ధి యైనదా?

మూర్ధా—ఐనదో లేదో, గురునాజ్ఞాప్రకారము పండ్రెండేండ్లు తప మొనర్చితిని. అతరువాత ఇట్లు బయలుదేరి ఈగ్రామమున యోగానందునిపేర నున్న ఈగురువర్యుని గుర్తించితిని. వీరింట దాస్యము సేయ నొప్పుకొని గురునకెన్ని యోబోధ లొనర్చితిని. కాని, వాని కవి కంటకప్రాయము లయినవి. ఏమియు పాలుపోక తుదకు వీరు నాచే ఈహత్య చేయించిరి. హత్యాదోషమున శిక్షింపఁబడి నేను దూరమవుదునుగదా అని వారిఊహ.

న్యాయాధి—(యోగానందునితో) ఇ దంతయు నిజమేనా?

యోగా—ఏమో. నే నెఱుఁగను.

న్యాయాధి—(ముద్దాయితో) నీవు చెప్పినది నిజమనుటకు నిదర్శనము?

ముద్దా—నా చెప్పినదానికిని, గురుని అనుగ్రహమునకును నిదర్శనముగ చనిపోయిన ఈమె కుమారుని బ్రదికించిన చాలునా?

న్యాయాధి—(ఆశ్చర్యముతో) చాలును. అట్లు చేయఁగలవా?

ముద్దా—ఆమె నాగురువును నాకు సమర్పించుకొన నిష్టపడునెడల మూఁడు నిమిషములలో బ్రదికింపఁగలను.

న్యాయాధి—(కవిమాయతో) ఏమమ్మా! నీ విందుకు సమ్మతింతువా?

కవి—(తనలో) చచ్చిపోయినవానిని బ్రదికింప వీఁడు దేవుఁడా? కానిమ్ము. వీఁడు చెప్పినచొప్పున నడచి ఆపని చేతగాదనిపించి ఆజన్మాంతము శిక్షాపాత్రుని జేయింపవలె. (ప్రకాశముగ) అట్లైన ఇం కేమి కావలయును! మా దుఃఖము లన్నియు తొలఁగి చనినట్లే.

న్యాయా—సప్రమాణముగ?

కవి—ఆ.

యోగా—(తత్తరపడుచు కవిమాయమొగము చూచును.)

న్యాయా—(ముద్దాయితో) ఏదీ కుఱ్ఱవానిని బ్రదికింపుము.

ముద్దా—(అంజలి మోడ్చి, ఆకసమువంక జూచుచు) దేవదేవా! అనాథనాథా! ఆ ష్టికహృదయారవిందావిర్భూత

నిత్యసత్యస్వరూపా! పాండురంగేశ్వరా! శరణు, శరణు. గురుఋణము దీర్చుకొన తదాజ్ఞానుసారము ఇంతింతపనుల కొడిఁగట్టితి. క్షమింతువుగాక. ఆర్తత్రాణ పరాయణా! నే నిజమైన దైవభక్తి గలవాఁడనేని, సంతతగురుచరణధ్యానరతుండనేని తప్పక నాసంకల్పితము సిద్ధించుఁగాక. భక్తావనా! ఇది నీ కెంతపని? దీన నీ వుపేక్షించిన నాకేమిగాని నీయాశ్రితజనవత్సలత్వ బిరుదము ఊరు పేరు లేకుండ పోవును. (అని కనులు మూసి ధ్యాననిమగ్నుఁ డవును.)

చెలికత్తెలు—(పటాక్షేపమున పిల్లవాని నెత్తుకొని పరుగు పరుగున వచ్చి) (కవిమాయతో) నెచ్చెలీ! ఇవె నీపుణ్య ములు పండినవి. ఎంత మే లోర్చినదానవో! నీమేలు దైవము గుఱుతించినాఁడు. ఇదుగో మనబంగరుకొండ. ఇపుడే మేము చూచుచుండఁగనే పాడాడుచు ఎచటి నుండియో సజీవుఁడై మాదరికి వచ్చినాఁడు. (అని చేతి కందింతురు.)

(పూలవాన గుఱియును.)

కవి—(సంతోషము నభినయించుచు, అందుకొని సంభ్ర మాశ్చర్యవిషాదములతో, కుఱ్ఱవాని నక్కునఁజేర్చి) (స్వగ తము) ఇంక నేమిగతి? వీఁ డెందును లొంగిపోక నాఁడుచ్చు నామెడకే తగిలించుచున్నాఁడు. ఇపు డేమి చేయవల యును? (ఆలోచన నభినయించును.)

యోగా—(నివ్వెరపడి) (స్వగతము) వీఁడు శిష్యుఁడు గాఁడురా బాబు, యమభటుఁడు. ఇఁకేమున్నది? సంసారవిచ్ఛేదము చేయనే చేసినాఁడు.

అందఱు—(ఒకరిమొగ మొకరు చూచుకొనుచు) ఆశ్చర్య మత్యాశ్చర్యము! ఈముద్దాయి ముద్దాయి కాక, తాను చెప్పినట్లు యోగసిద్ధుఁడే.

కవి—(కళవళపడుచుండును.)

న్యాయాధి—(ఒక కాగితము వ్రాసి గుమాస్తా కిచ్చును.)

గుమాస్తా—(చదువును.) ఈ మాయలాడి కవిమాయ తన మాయాబలమున బ్రహ్మవంటి ఈమునిని వలలో వైచికొని ఈయనతపస్సు గోదావరిపాలు చేసిన దనుట నిర్వివాదము. కామిను లెంతెంతలు సేయరు? ఈమానియు ఏమూపు ననో ఈచపలకు స్వాధీనుఁ డయ్యె ననియే నానమ్మకము. విషయరసప్రవాహము కొండలవంటి మహర్షులనుగూడ తలక్రిందు చేయకుండదుగదా. ప్రస్తుతమున ముద్దాయి పలికినదెల్ల ఆశ్చర్యము, వాస్తవమును. దీని కితని మృత సంజీవనీవిద్యయే తార్కాణము. కావున వారిఒడంబడికల ప్రకారము ముద్దాయి ఫిర్యాదిని, కవిమాయ కుమారుని తీసికొని ఇష్టము వచ్చినట్లు వెడలిపోవలయును.

కవి—(ముఖమున చీరకొంగిడి శోకింపఁదొడఁగును.)

యోగా—(పెదవులు తడుపుకొనుచు పిచ్చివానివలె దిక్కులు చూచును.)

న్యాయా—(తనస్థానమును వదలి వెడలిపోవును.)
అందఱు—(వెడలి పోవుదురు.)

(తెర పడును.)

## మూఁడవ రంగము

(అడవిలో యోగివేషములతో యోగానందుఁడు, శిష్యుఁడు ప్రవేశింతురు.)

శిష్యుఁడు—గురువర్యా! త్వరగ నడువుఁడు. చాలదూరము పోవలసియున్నది.

యోగా—ఇది యేటి ప్రయాణమురా బాబు! చీఁకట్లు గ్రమ్మి కనులు మూసినను, తెఱచినను ఒకటిగనే ఉన్నది. పైన అడవిదారి. ఱాలు, ముండ్లు గల యీనేల కాలుమోపుటకు చాల భీతి గొలుపుచున్నది.

శిష్యు—మహాత్మా! ఇవన్నియు అకించిత్కరములు.

యోగా—అదెట్లు? కాళ్ళు బ్రద్దలగుచునే ఉన్నవి. కీచుఱాళ్ళఅఱపులతో చెవులు పగిలిపోవుచున్నవి. నడుమ నడుమ దొంగలు, క్రూరమృగములు, తేళ్ళు, పాములు, దెయ్యములు. న న్నెందుల కిప్పుడే చంపవైచదవు? ఈరేయి ఈమఱ్ఱి చెట్టుక్రింద గడుపరాదా?

శిష్యు—ఇట్లు ప్రయాణించిన గమ్యస్థానము చేరు టెన్నఁటికి? ఇదిగో, సర్వసత్త్వప్రబంధనవిద్య నిచ్చెదఁ గొనుఁడు,

చీమమొదలు పులివఱకు ఎట్టిజంతువునయితము మిమ్ము స్పృశింపనేఱదు. ముండ్లు, ఱాళ్ళు బాధింపవు. ఆయాసముమాటయే ఉండదు.

యోగా—దొంగలో?

శిష్యు—దొంగలు మనపై కేల వత్తురు?

యోగా—ఏల వత్తురా? మాడు చితుకగొట్టుటకు.

శిష్యు—కొట్టి?

యోగా—(వెదకికొనుచు) నామూట యేది?

శిష్యు—సాయంకాలము సంధ్య వార్చుచు ఆయేటిలో లోతు చూచి పాఱవైచితిని.

యోగా—(స్వగతము) వీఁ డెంత చలపాది? వాఁ డ్రేయసి మూటగట్టి ఇచ్చిన బంగారముకూడ దానితోఁ బాటు యేటిపాలైనదే! (దుఃఖించును.)

శిష్యు—అయ్యా! అదియే ఆపదలకు మూలమని అట్లు చేయవలసివచ్చినది. ఇఁక దొంగలభయము మాని వడిగ నడక సాఁగింపవచ్చును.

యోగా—(స్వగతము) వీఁడు మనసులోని మాటకుకూడ సమాధానము చెప్పుచున్నాఁడే! ఇంకేమి చేయుదును? (నడచును.)

శిష్యు—మనసులోని మాటలే కాదు; మీరును మీతలో దరియు ఆగోడవెనుక చేసిన ఆలోచనయు నాకుఁ దెలియును.

యోగా—(నిశ్చేష్టుఁడై) ఆ ఆలోచన యేది?

శిష్యు—చెప్పవలయునా ?

యోగా—చల్లకు వచ్చి ముంత దాచుకొనుట ఎందులకు ? చెప్పుము.

శిష్యు—నేను నిద్రపోవునపుడు నాతల ప్రక్కలుసేసి మీరిరువురు మామూలుగ సుఖపడవలె ననుకొనలేదా ?

యోగా—(తలవంచి నిరుత్తరుఁ డవును.)

శిష్యు—ఆర్యా !

తే. ఏమి శాశ్వత మని నమ్మి యింతిఁ జేర
నీదుశిష్యుని హింసింప నిశ్చయించి
తదియు నీచేత నవునె ? నీయాత్మ నాకుఁ
దెలియకున్నదె ? చాల్జాలు. వెలితిఁబడకు.

యోగా—(తడఁబడుచు) నే నట్లు... ... ...

(తెర వ్రాలును.)

## నాల్గవ రంగము

(అడవిలో యోగానందుఁడు, శిష్యుఁడు. శిష్యుఁడు పరుండి నిదురించు చున్నట్లుండును. యోగానందుఁడు కూర్చుండియుండును.)

యోగా—శివశివా ! ఎంతలో ఎంతమార్పు కలిగినది ?

శా. సంతానం బపదిక్కుమై తెరల వాత్సల్యంబు పోఁద్రోచి నా
కాంతారత్నముఁ గోలుపోయి యిటు లికాంతారమధ్యం

బుఱ్ఱ జింతల్ చుట్టఁగ వాన కెంపకయి వాసిం బాసి
జీవింపఁగాఁ బంతం బొప్పు లిఖించెనేమొ విధి, పాపంబే
యిటుల్ సేసెనో !

అపరూపమైన పాపము ఏమి చేయఁగలదు ?

ఉ. ఆవిధి యేమి సేయును ? మహామునిముఖ్యులమంచుఁ
గొంద ఱీజీవులకొంప దీయఁ గడుఁ జిక్కఁగ వ్రాసిరి ధర్మ
ముల్; వెతం దైవము ద్రోవ వారల ననం బనియేమి? య
దేమిసేయు? నీయాపదపాయ మేను మఱియాదకుఁ బోయి
గదా గడించితిన్.

అట్లనుకొననేల? నే నేమి చేయఁగలను? పోను అనిన
ఆఅధికారులు తన్ని పంపరా ? ఈ ఆషాఢభూతి ఊరకుం
డునా? ఇంతకు నాచంచలాపాంగి నెడఁబాసి ఈఅడవిలో
ఈరాత్రి ఎట్లు గడుపఁగలను? ఇదె సమయ మనికాఁబోలు,
తారానాయకుఁడు కూడ వేయికిరణములు జొనిపి న
న్నలయించుచున్నాఁడు. వీనికి తోడు మేనల్లుఁడు; వానికి
తోడు వీఁడు; వీరిద్దఱివెంబడిఁ బడి పాడుగాలి. ఎవ్వరి
నే మనిన ఏమి లాభము? కర్మ మనుభవింపక తీరునా?
(తల యూచును.)

తే. హాయిలో సర్వవిషయంబు లంతరింప
ముక్తి యన నిదె యని భవత్సక్తిఁ బొంగు
నన్ను నిను బాపి యిట్లు సన్యాసిఁ జేసె
మాలదైవ మిఁ కేమందునే లతాంగి!

కటకటా! ఎంత కటికిగుండె కాకున్న—

శా. సింగారంబున నిగ్గు వెట్టి కుఱులం గ్రీమించు హేమంబుతో
సంగోషుం బనురాగపూరమున బింబోష్ఠంబు నిర్మించి త
న్వంగీ! నీనో సటం విధాత యిటు వ్రాయుం జేతు లెట్లాడె?
నన్నుం గామాగమసారధూర్వహామనోంధుం జూపెం జో
ఒవ్వామిం.

కానిమ్ము. తరుణీ! ఈతూరిజన్మమున కేని తప్పక నిన్నే
జేరెద. ఈశరీరములో నిన్ను గలియు యోగ ముంశీన
శిష్యుం డను పేరుతో ఈభూతము న న్నావహింపదు.

శిష్యు—(ప్రక్క మాఱి ఆవులించుచు ఒడలు విఱిచికొనును)

యోగా—(చూచి భయముతో) (స్వగతము) ఇంక మనస్సులో
నైన అనుకొనరాదు కాంబోలు. (ప్రకాశముగ) కుమారా!
నిద్ర తెలిసి ఎంతసే పైనది?

శిష్యు—(నవ్వుచు లేచి కూర్చుండి)

ఉ. నా కొక నిద్ర యెక్కడిది నాగురునాయక! నీమనమ్ము ల
క్ష్మీ రమణీయ మూర్త్యకృతిసిద్ధిద మౌ నల విట్ఠలయ్యపై
నీ వ్రేకుపయిం బడల్పడి పనింగొను నెప్పటి కప్పుడే జుమీ
యాంకలి డప్పి నిద్రయు మహాసుఖముం గలుగుం
మదాత్మకుం.

ఒక్కటి అవధరింపుము —

ఆ. భూతమయము లెల్ల పురుషులదేహంబు
లాత్మ వెలుంగు నొక్కం డన్నియెడలం
బ్రేమ గలుగవలయు రెండువిధంబుల
సకలజీవులందు సమము గాంగ.

ఇంక రాగద్వేషపాశములఁ జుట్టుకొని అట్టిట్టుగాక ఆప దుద్ధారకుఁడవు పాండురంగేశు భజించి కృతార్థుఁడవగుము.

యోగా—నీయట్టిశిష్యుఁడు దొఱకిన నాకే లోపముగలదు? కాని, అనుభవింపఁబడిన విషయవాసన వెంటనే విడువదు గదా......ఇపుడు నాకు కొంచెము కొంచెముగ జ్ఞాపకము వచ్చుచున్నది. పూర్వకాలమున కామ్యకర్మ మొనర్చితి నఁట. దానికై పాండురంగవిభుఁడు నాకా పడఁతిఁ గూర్చెనఁట. కాకున్న నే నింత గోతిలోఁ బడుదునా?

శిష్యు—ఈమాట మీ కెవరు చెప్పిరి?

యోగా—ఆ దేవదేవుఁడే.

శిష్యు—ఎక్కడ?

యోగా—

క. ఇంతకు నాకమలాక్షిగృ
హాంతరమున విట్లలయ్య సాక్షి కుమారా!

శిష్యు—(పకపక నవ్వుచు) ఏమి ఆవిగ్రహముసాక్ష్యము!
పొంత నమరి పలికిన య
క్కాంతసఖికి సాక్షు లిచటఁ గలరె గురువరా!

యోగా—(కోపముతో) ఏమి నీ అతిక్రమము? దేవతలను గూడ నమ్మవా?

శిష్యు—నమ్మ కేమి? ఇదె దివ్యదృష్టి నిచ్చెదను. మీరును పరిశీలించి చూచి చెప్పుఁడు. (ఇచ్చును)

యోగా—(పరిశీలించుట నభినయించి, విసువుతో) ఔరా, కాంత లెంతజంతలు! నాయట్టివానిని ఇట్టిగతికిఁ దెచ్చిరి గదా! (ఆలోచించి, తల పంకించుచు)

తే. అకట! వికటాత్మ లైన యొయ్యారు లనఁగ
నవనిఁ బురుషులపాలి దయ్యాలుగారె?
డంబ మనృతంబు టక్కు లాడంబరములు
కళలు వీరియుపాదానకారణములు.

మన్మథునికి చిక్కనివానినిగూడ చూపులకోపులతో సాధింతురు. అంతదాక యెందుకు? తీపులుపుట్టు కల్లబొల్లి మాటలు చాలవా?

ఆ. ఆత్మహితముపొంటె ననువుగా మగవారిఁ
గొలుతు రంతరాత్మఁ గలఁతు రంతె
కాఁగడాలు వైచి గాలించినను సుంత
స్త్రీలయందు ధర్మశీల మున్నె?

(ఆర్భాటముతో వెదకుచు) ఏది నాకమండలము?

శిష్యు—గురూత్తమా! త్వరపడకుఁడు. కొంద ఱట్టుండవచ్చును. అంతమాత్రమున స్త్రీజాతికెల్ల కళంకము తెచ్చి పెట్టవచ్చునా? సుశీల మున్నగు పతివ్రత లెందఱు లోకమున లేరు? వారిపేరు స్మరించినయంతన పాపములు పటాపంచలుగావా? శాంతింపుఁడు. శాపమున కిది అదనుగాదు.

యోగా—శాంతింపక చేయునదేది? ఇప్పు డంతయు తెల్లముగ తెలిసికొంటిని. ఇఁకముందు నీవు నాకు గురుఁడవు; నేను నీకు శిష్యుఁడను.

శిష్య—అట్లనకుఁడు. ఎప్పటికిని మీరే గురువులు. మీ ఆజ్ఞాప్రకారము ప్రవర్తించు శిష్యుఁడు వీఁడు.

యోగా—ఆహా! నీయోగ్యత! ఇంత చేసియు నీవినయము విడువవు! అది అట్లుంచి ప్రస్తుత ముపదేశింపుము.

క. అలవున సంపాదించితి
జల గడిగితిఁ బున్నెమెల్ల శాంతిపర! నను౯
వెలయించుధర్మ మేదీ
అలసితి నిం కేది యొనర్తు నార్తుఁడ నైతి౯.

శిష్య—గడచినదానికి వగచిన నేమి ప్రయోజనము?

యోగా—వగవ కేమి చేయవలె? (నిర్వేదముతో)

సీ. కన్నాతఁడ డీ నొక్క కన్నెఁ గైకొనలేదు;
చానలజోలియే మానలేదు;
మఖముల సురల సంభావించుపని లేదు;
కెలిలి దైవమ్ముల గొలువలేదు;
పూర్తసుకృతములఁ బొనరింపఁగాలేదు;
ప్రణవోక్త్యనుష్ఠానపరత లేదు;
పూనిక నిత్యాగ్నినైన ధరింపలే;
దాత్మాగ్నిధారణాయతియు లేదు;
కాదు గార్హస్థ్యము, యతిత్వకలన గాదు;
విధికిఁ బాసి చరించితి విచ్చలవిడి;
స్వర్గతియు లేదు, లేదు మోక్షప్రసక్తి
నాకు. రెంటికిం జెడిన సన్న్యాసి నైతి.

ఐన ఇపు డిది యంతయు నేల ? నీవు చెప్పినచొప్పున నడచుటయే కర్తవ్యము. ఏదేని ఒక త్రోవ చూపుము.

శిష్యు—ఇదివఱకే చెప్పియుంటిని. పతితపావనుఁడు, భగవానుఁడు, పుండరీకవరదుఁడు, అగు పాండురంగవిభుఁడు కలఁడుగదా.

యోగా—అతఁడుమాత్రము ఇట్టి నన్ను మన్నించునా?

శిష్యు—మన్నింపకేమి?

చ. ఎఱుఁగవొ పుండరీకముని కింపవు నవ్విభుపెం పెఱింగియున్ మఱచినఁ జిత్తగింపు జనమాన్యతపోవిభవా! భవాదృశుల్ తఱిఁగొన మోక్షమీయఁడె? పతత్పశుకీటకుజాదిజాతులన్ గఱకఱి మాన్పి ప్రోవఁగ దుకాణము వెట్టినవాఁడు వేఁడుకన్.

ఆపరమేశ్వరునకు భేదభావము లేదు.

మ. అనుమానింపఁడు వారిదైనఁ బురుషుండైనన్ సమర్థించున ప్డనుకూలించునె కాని పాపమనిపుణ్యంబంచుఁ దన్నాశ్రయించినచోటం గమనింపఁ డావిభుఁడు నిస్సీమప్రమోదాత్మకుం డనఘా! పాసి చనంగ లేఁ డతఁడు చిత్తాబ్జాసనమ్మిచ్చినన్.

కావున ఆస్వామిని సేవింప పండరీపురమునకు శీఘ్రముగ పోదము, రండు.

యోగా—అవశ్యము.

(ఇరువురు పరిక్రమించి నిష్క్రమింతురు.)

---

# కవిమాయ

## పంచమాంకము

### మొదటి రంగము

(రాధ, చెలికత్తె కూర్చుండియుండి ప్రవేశింతురు. రాధ అఱచేతిలో మొగము పెట్టుకొని విచారపడుచుండును.)

చెలి—సఖీ! సంతతోల్లాసవగు నీకు నేఁ డీ విషాద మెందు వలన సంభవించినది?

రాధ—(వేడినిట్టూర్పుతో ఊస్సురనును.)

చెలి—నెచ్చెలులకుగూడ నుడువరానంతటి రహస్యమా?

రాధ—ఓసీ! న న్నేల వేధించెదవు? ఇందు రహస్యమేము న్నది? అందఱకు తెలిసియున్నదియే.

చెలి—అట్లయిన ఏల చెప్పరాదు?

రాధ—పరిహసింతు రని.

చెలి—ప్రాణములకు ప్రాణములైన ప్రాణసఖులు పరిహ సింతురా? చేతనైన సాయము చేయుదురుగాని.

రాధ—చేతగాకున్న?

చెలి—దుఃఖమున భాగము పంచుకొందురు.

రాధ—ఒకరికై మఱియొకరు దుఃఖ మనుభవించుటయు సంగతమా?

చెలి—అది ఇప్పుడు తప్పినదా?

రాధ—అయిన నన్ను విడువవా?

చెలి—విడుచుటకా స్నేహము చేసినది?

రాధ—ఐన నాప్రశ్నములకు సరియయిన సమాధానము లిత్తువా?

చెలి—మొదల నాకు సమాధానము లిమ్ము.

రాధ—నా సమాధానములోనే నీసమాధానము ఇమిడియుండును.

చెలి—అట్లయిన, అడుగుము.

రాధ—అనుకూలనాయకుఁ డన ఎట్టివాఁడు?

చెలి—ప్రియురాలిముంగురులు దిద్దుచు, ఆమె నలంకరించుచు, ఒక్కనాయికను అనుసరించి నీడవలె ఎడఁబాయక మెలఁగువాఁడు.

రాధ—వానిప్రియురాలిపేరు?

చెలి—స్వాధీనపతిక.

రాధ—అట్టివా రెవ్వరైనఁ గలరా?

చెలి—లేకేమి? సీతారాములు.

రాధ—ఇం కెవ్వరైన?

చెలి—ఉన్నారేమో! నాకు స్ఫురించుటలేదు.

రాధ— అందువలననే ఈవిషాదము.

చెలి— ఓహో! ఇదియా అసలు సంగతి! ఒక అనుకూల నాయకుఁడు, స్వాధీనపతిక వీరితోనే సరిపోయినదా శృంగారము? దక్షిణనాయకులు లేరా? కామినుల నేలరా? ఇరువురు సుఖింపరా?

రాధ—అదియు నిజమే. అట్టివారి నొకరిద్దఱిఁ జేరొ్కనుము.

చెలి—ధర్మరాజు, అర్జునుఁడు మున్నగువారు.

రాధ—అందును నేఁ జేరకపోయితి నని యే మఱింత విషాదము.

తే. పతులు ధృష్టులు, శఠులైన పడఁతులగ్రుక
కెన్నికకు వచ్చు వీథికి నెక్కె యకట!

చెలి— నీ వనునది నిజమే.

చేయునది యేమి? మగఁడు రండా! యటన్నఁ
గీడుప ల్కాడఁడే బిచ్చగాఁడు కూడ?

ఐన ఇది నీవిషయము గాదు.

రాధ—కాకేమి? నామొగమున కొమ్ములు మొలచినవా?

చెలి—ఇంతకు చెప్పవలసిన అంశము నటుంచియే కాలక్షేపము చేయుచున్నావు. జాణ లన ఇట్టివారే.

రాధ— నాజాణతనమునకు నీవు సంతసింపవలయును.

చెలి—నేను కాదు, శ్రీకృష్ణపరమాత్మ.

రాధ—అంతటిభాగ్యమే ఉన్న ఇంత గోల యేల?

చెలి—ఇపు డేమి ఫుట్టి మునిఁగినది?

రాధ—విందువా అది! ఆధూర్తుఁడు సెజ్జపై పరుండియుండి తెఱచిన కనులు తెఱచినట్లే ఉండ నేఁబోయి నాథా అని

పిలచిన మాటాడకుండుట సరికదా చూడనైన చూడఁడు, వినిపించుకొనఁడు.

చెలి—ఇది కేవలము విరుద్ధము. రాధాలోలుఁడని గదా అతనికి వాడు ?

రాధ—వా దట్లు వచ్చినదికాని, వానికి ధరపైఁ గల ప్రేమాతిశయము మఱెవరియందును లేదు.

చెలి—మొదటినుండియు ఇంతే ?

రాధ—ఇంతేకాని, ఇపుడు పూర్తిగ స్పష్టమైనది.

మ. బడిపంచం బడి యుండువానిపలుకే బంగార మయ్యెం
దుదిఁ దా సడికిఁ లోఁబడి పేరు మార్చితి ధరాసంగంబువం
జూచునం చడియూసం బడి ........

చెలి—ఐన నీపడిన అభిప్రాయము కాదేమో? ధరాసంగము కలవాఁడు నీ పేరుమార్పు కనుకూలింపవలయునుగదా ? కావున ఏభక్తుల భక్తికైన పరవశుఁ డయ్యెనేమో ?

రాధ—

.........కాదు కాదు చెలియా ! ఆభంగి నేఁ డెద్దియో
కడు మో జేర్పడెఁ గ్రొత్తదానిపయి, శక్యం బౌనె
గుర్తింపఁగన్.

చెలి—కానిమ్ము, నేఁడు క్రొత్తది యైన రేపు ప్రాఁతదే కాఁగలదు. పదియాఱువేలలో అది పదియేఁడవు వేయిలోమొదటిది. దాన నీ కేమి లోపము ?

రాధ—లోపమే లేదు—

తే. పొలితి గలదాన పరముఁడౌ పురుషున కిది
భాగధేయ మ్మొసఁగిన సంపదయె వెండి
అందగ త్తియ ననుచు నానంద మొంది
యెగసియాడితి నాగర్వ మేటి కింక ?

నీవు నన్నిఁక అడ్డగింపకుము.

క. ప్రాయోపవేశమున నీ
కాయము దొఱఁగెద విపన్నికాయము లెల్లన్
బాయఁగ సుదతీ! విను మా
తోయజదళనయనునాత్మతో నాసఁ దగుచున్.

(కన్నీరు నించుచు.)

చెలి—కృష్ణ కృష్ణ! (చెవులు మూసికొని) ఈపలుకులు నీ వనరానివి, నే వినరానివి. ఒకవేళ ఆభగవంతునకు మఱొకజవ్వనిమీఁద అనురాగ ముదయింపవచ్చు. అంత మాత్రమున నీ విట్టి అకార్యమునకా దిగవలసినది? అయిన ఇన్నినాళ్ళవఱకు ఆతఁడు ఏకపత్నీవ్రతుఁడై యుండెనా?

తెరలో—నాథా! ధ్యానము చాలించి పలుకరా? మీరిచ్చిన చనవున ఇట్లనుచుంటి. నే నెంత ఆలోచించినను మీ ఈ ధ్యానధారణకు కారణము కన్పట్టదు.

సీ. పడఁతి యెవ్వతె యైనఁ బ్రార్థించెనే నొక్క-
మాటతో నాపద మలుపరాదె;
ప్రబలుండు దుష్టుఁడై బాధింపఁజొచ్చిన
ననుపరాదె సుదర్శనాయుధమ్ము;

సాక్షాత్కరించి ప్రసాదింపఁగారాదె
భావితాత్ముం డయి భక్తుఁ డున్న;
సెలవీయరాదె మార్పులు కొన్ని జగమున
కవసరం బైన నింద్రాదిసురల;
కింద్రియంబుల నెలయింప నెంచెదేని
నర్థముల కేమి కొదువ తె మ్మనఁగరాదె;
(ఆతురతతో)
సమయకల్పితమై తీర్పఁజనని యెడరు
లోక మెనయదుకాదె లోకైకనాథ!
చెలి—(చెవియొగ్గి విని) వింటివా ? రుక్మిణికూడ నీవలెనే మొత్తుకొనుచున్నటు లున్నది. దానికిని సమాధానము లేదు.
రాధ—(నిశ్చేష్టురాలై వినుచుండును )
తెరలో—(మఱొకస్వరమున) ఆర్తశరణ్యా! పతితపావనా ! వన్నిఁక కటాక్షింపక తప్పదు.
సీ. అంబుధిఁ జొచ్చి మాయావిఁ జంపుట గాదు;
కొండ వీఁపునఁ దాల్చు కొలువు వలదు;
కొమ్మునఁ బుడమి సర్వమ్మెత్తుపని గాదు;
జాతులు మార్చు వేసంబు వలదు;
కొట్రమై లోకముల్ గొలుచునక్కఱ గాదు;
నెత్తుటఁ జెఱువులు నింపవలదు;
సంద్రంబు గట్టి ద్వేషణు మార్కొనుట గాదు;
బుజమున నాఁగలిఁ బూనవలదు;

ప్రాంతచట్ట మ్మొకటికి మార్పంగవలదు;
కత్తిఁ గైకొని గుఱ్ఱ మెక్కంగవలదు;
చాలుఁ గడగంటఁ దొఱఁగు కృపాలవంబు
సిద్ధసాధన! నన్ను సముద్ధరింప.

రాధ—(విని) చెలీ! ఎవని దా కంఠస్వరము?

చెలి—(మాటాడక చెవి యొగ్గి వినుచుండును.)

తెరలో—స్వామీ! సర్వాంతర్యామీ!

ఆ. మాయఁ బన్ని యొకఁడు మాయలాడి పొనర్చు
కార్యగౌరవమ్ముఁ గానలేని
యట్టి కర్మ మనుభవార్హ్యమే యకట! నీ
యట్టివాని నమ్మినట్టి నాకు?

చెలి—దేవీ! నే ననలేదా, ఇది భక్తుని భక్తి చేసిన పారవశ్య మేమో అని?

రాధ—(దిక్కులు చూచుచు) ఔనౌను, ఆస్వరము, భక్తిః ఉద్రేకపూరితములై ఉన్నవి. ఎట్టి ధ్యానయోగముతో కట్టివేయుకున్న ఇంద అన్నుమిన్నలలో ద్రేలు వంపించు కొనక తిరుగు నానాథుఁడు నేఁ డిట్లు స్తబ్ధుఁ డవునా? నాకు భయముగ నున్నది. ఇం కేమనునో వినుము.

తెరలో—భక్తవిధేయా! ఆయెంబోయె. నాచరితము నీ వెఱుంగనిదియా! పిష్టపేషణ మేల?

ఇష్టం బైనది యింపుగాక, గజరా జేనాఁటిచుట్టంబు, సంధిష్టంబుల్ తలఁ దాల్చి మోచితివి కొంతేయుల్ దొరల్ నీకు, నిర్దుష్టుండో సురనాథు నేలెదవు, కద్దో లేదొ మా

## రెండవ రంగము

(చంద్రశేఖరాశ్రమము. మాటలాడకుండ ధ్యాననిమగ్నుడై ఆత్మార్పణ మొనర్చి కూర్చుండియున్న యోగానందుడు, సమీపమున పాదాక్రాంతుడగుచు శిష్యుడు ప్రవేశించుతాడు.)

శిష్యుడు—దేవా! ఇంకను రావేమి? భక్తరక్షణమున గారె ప్రాణ్నాలుటకు నెత్తుమా? రాధకౌగిట చిక్కునప్పటి నుండి మొదలతే కదా? ఇట్టి మోహిని మాయమ్మ లగ్గమణి గొలుసు దెబ్బతో గాబోలు! ఇదే నాపని నేను ఘనముగ కొనవలసినదే?

పాండురంగడు—(రాధా రుక్మిణీ సహితుడై వెలుపలివారి ముత్తో పదుకైదుగుడు నడచివచ్చి యోగియెదుట చిడిముడి పడుచు నిలువబడును.)

యోగానందుడు—(కదలక మెదలక అట్లే కూర్చుండి యుండును.)

శిష్యు—దేవదేవా! యోగానందుని శిష్యుడు మల్లినాథుడు నమస్కరించుచున్నాడు. (నమస్కరించును.)

పాండు—వత్సా! సంతతానందప్రదకమగు. (ఆశీర్వదించి) నీ గురువు మాటాడడేమి?

శిష్యు—నీరాక ఆలస్యమైనదని తాను కష్టపడియున్నవాడు గావున విసిగి ఆత్మార్పణ మొనర్చియుండుట ఇంతలో మఱచితివా? నీకిచ్చిన వాగాదీంద్రియములు తానెట్లుప యోగించుకొనును?

పాండు—(యోగిశిరమున కర మిడి) చిత్రము ! ఎంత సాహస
మొనర్చితివి ! (చకితుండగును.)

శిష్యు—

తే. విస్మయించెద విటు చూచు విశ్వనాథ !
ఏరితో నేమి పని యింక ? వెస విదేహ
కేవలత్వంబు దయసేసి కృతి కృతార్థ
ముగ నొనర్పంగదే మహామోద మొదవ.

పాండు—

క. మునివర ! కాలాంతరమున
ననుగ్రహించిన యట్టి యపవర్గమ్మున్.

శిష్యు—ఐన నిపు డేమి చేయు మనెదవు ?

పాండు—

ననుఁ జిత్తమ్మున నిడుకొని
తను వన్మూర్తులయి క్షమఁ జరియింపఁగన్.

శిష్యు—అది యెట్లు కుదురును ? ఆ కాలము మించిపోయి
నది. సర్వేంద్రియాపహులు నీ కొసంగినవాఁడు లోకమున
నెట్లు వ్యవహరింపఁగలఁడు ?

పాండు—ఆ కొఱంత దీర్చెదను. దానఫలముతోఁ బాటు ఈతని
సర్వస్వము మరల నిచ్చివేసితిని. (ఇచ్చుట నభినయించును.)

యోగా—(కనులు దెఱచి) దేవా! నీ కర్పించిన పదార్థము మఱలఁ గొనవచ్చునా?

పాండు—నే నిచ్చినఁ గైకొనవచ్చును.

యోగా—అ దెట్లు?

పాండు—అశ్వమేధాదులయందు యాగదక్షిణగ ఇచ్చిన భూమిని యజ్వలు మఱల ధన మిచ్చి కొనుట లేదా?

యోగా—ఈనిర్బంధ మెందులకు?

క. మును పిల్లె భ్రష్టుఁ డయితిని
మనిచె నితం డెట్టులేని మఱి యేటికి వెం
డి సనుం ద్రోచెను సంస్కృతి
వననిధి నకటా! శ్రమంబు పడెఁజాల నిఁకేల.

కావున ఓ దేవదేవా! మాశిష్యుఁడు కోరినట్లు కేవలకైవల్య మొసఁగి మముఁ గృతార్థులఁ జేయుము. లేకున్న, ఈ మాయామయప్రపంచమున ఇం కెట్టిమోసము వాటిల్లునో?

పాండు—అన్నపు డెల్ల ఇట్టివియే తటస్థించునా? తటస్థించిన దానికి మాత్రము కారణము లేదా? ఆ అతివచరిత్రమును, తచ్ఛాపమును, వినియే ఉంటివిగదా. నాఁడు నీవు వినిన ప్రారబ్ధవిషయము అప్పటికి కల్పితమే అయినను నిజముగ అట్టిది కలదనియే నమ్ముము. అది తీఱుటకు ఈ పన్నాగము పన్నించినవాఁడను నేనే. ఇపు డావెయు శాపముఁ బాసి తనతోడిఅప్సరసలతోఁ గూడ ఇట్టి శుభము నొందిన నీపై

పుష్పవృష్టిఁ గురియించుచు (పుష్పవృష్టి కురియును.) ఆకసమున నిలిచి యున్నది చూడుము.

అందఱు—(ఆకసమువంకఁ జూతురు.)

యోగా—అటు లయిన నీఅనుగ్రహమున అన్నివిధముల కృతకృత్యుఁడ నయితిని. ఇపుడే కైవల్య మీవేని మా ఈ ప్రార్థితములు సమకూర్పుము.

శా. మాకుం బాయని మైత్రి ముఖ్య, మటుపై మానాథ! నీపై
మనం బేకారూఢము కావలెన్, వినుము, మే మెట్లున్నఁ
గీ డేమియున్ లేకుండఁగ వలె, నిష్టమై నపుడ వీనిం
జొచ్చెదంగాక, సర్వాకారంబున మత్కథాశ్రవణ మాత్మా
మోదమునుం గూర్చుతన్.

పాండు—తథాసు.

రుక్మిణి—మీబుద్ధి ఎల్లపుడు సుప్రసన్నమై యుండుఁగాక.

రాధ—మీయశము వెల్లివిరియుఁగాక.

(తెర పడును.)

సమాప్తము.

---